యనుచుం దత్ క్షేత్రసమగ్రమహాత్త్వ-
మునఁ జేసి వైరాగ్యమున[1]మది-[2]వొదల
వచ్చువారును, జొచ్చువారును,[3] వెనుక
వచ్చువారును, జూచువారునైయుండ,
నారూఢ[4]మతి మల్లికార్జునపండి-
తారాధ్య[5]సుతుఁడు దోనయ్య సంప్రీతి
నాగమోక్తముగ భక్తా[6]ళియుఁ దాను
జాగరణోద్యుక్త[7]సంగతబుద్ధి

దోనయ్య శివరాత్రి జాగరణము

మానితప్రాసాదమండపగోపు-
రానీక దీపప్రభాభ్యంతరమున
విలసిత వివిధనవీనాంబరప్ర -
కలిత మండప మొప్పఁ గావించి, యందు
వరిచిత క్రముక రంభాస్తంభముకుర-
భరి[10]తోత్త[11]రంగ [12]శుం భద్ద్వారతతులు
సంచితనీలదృషత్కుట్టిమములు
నంచితోత్పలసమాయతతోరణములుఁ

౧. మయి; మొటు; మేరు, ౨. వదల. 3. నుద్ధతిని, ౪. గతి, ౫. గురు; నుతు, ౬. వలిదాను, ౭. సంగ్రహ; సంగతి, ౮. వస్త్ర, ౯. లించి, ౧౦. తోక్తి, ౧౧. రంభ, ౧౨. శుంభద్వా.

గంబుకట్లును మేలుకట్లు[౧]ను జుంబి -
తంబులై యొప్పు నూతనఫలావళులు
[౨]నుపఫలావళులుఁ బుష్పోప[౩]హారములు
[౪]నుపపద్మముకురము లుపరత్నములును
మానితబహువర్ణమహితోపవార్ధి -
ఫేన[౫]పుంజంబులుఁ బృథుతరంగములుఁ
గమనీయ నిజరత్న కందుకావళులు
నమితసువర్ణలతాంతమంజరులుఁ
బరిమితద్రాక్షాది ఫలగుచ్ఛములును
గురుతర విద్రుమాంకురలతా[౬]తతులు
భర్మాంబు[౭]రంజిత పటచిత్ర వస్త్ర -
నిర్మితబహుపక్షి నివహాతిశయముఁ
బక్వాన్నవలయముల్ వక్వఫలములుఁ
బక్వాన్నపూరముల్ [౮]వటుపతాకలును
నరుణాబ్జకర్ణికా రాశోకరక్త -
కరవీరచంపక కైరవాద్యఖిల -
సురుచిర ప్రసవనిష్యూతమాలాప్ర -

---

౧. నచుంబి, ౨. పొలుపొందుచున్నట్టి పుష్పమాలికలు, ౩. మాలికలు, ౪. సలలితపద్మముల్ సరసరత్నములు, ౫. పూజం, ౬. వళు, ౭. రాజిత, ౮. చ, ౯. బలు.

ప్రథిత మృదంగాది [౧]బహుఘోషణంబుఁ
గాంస్యతాళానేకఘంటికాతీవ్ర-
[౨]శంసోక్తరావంబు జయజయధ్వనులు-
నలరు సంధ్యావేళలం దందమేని
నిల వాద్యరవ[౩]మతా నేప్రొద్దుఁగూడ
గర్జిల్లు నప్పు[౪]రి ఘనఘనాటోప-
గర్జ[౫]నంబున గిరుల్ [౬]గర్జిల్లు చుండ
వారక *చీకటి వర్ణింతమంద-
మారాదు దద్దీపమాలికాతతులు
ప్రాసాదగోపుర బహుహేమకలశ-
భాసుర ద్యుతులు శుంభద్ధ్వజదండ-
ఖచిత భాస్వద్రత్న కలితదీధితులుఁ
బ్రచురప్రభలపేర్మి రాత్రుల్ పగ[౭]ళ్ల
తెఱఁగున వెలుఁగారఁ దిమిర మప్పురిని
నెఱి నెన్నఁడును[౮]లేదు, నేఁ డేల చెప్ప?
నరి[౯] జారచోరులఁ జర్చింతమేనిఁ
జరితార్థవంతు[౧౦]లు శైలాగ్రచరులు,
నుడు[౧౧]పంక్తి వర్ణింప నూహిం[౧౨]తమేని

౧. పటు, ౨. శంసోత్తరారవ, ౩. మె, ౪. దు, ౫. నగతి, ౬. భు, ౭. ల్లు, ౮. వేరు. * చీంకటి. ౯. జాడ, ౧౦. లై, ౧౧. పతి, ౧౨. తు.

నుడుపంక్తిఁ [1]గనఁబడ దానభోవీథిఁ,
బటుతర పురసముద్భవ ధూపధూ[3]మ-
పటలంబు నీలాభ్రపటలమైయునికి
జలజోత్పలావికస్వరవికస్వరత
[4]లలవడ వర్ణింత మందమేనియును
భాసురాభ్రంకష పర్వతోన్నతిని
నాసూర్యచంద్రోదయాస్తమానములు
గోలఁకులఁ గలువలకును దామ[5]రలకు
నలి నహర్నిశము గానంగరాకునికి
నప్పాట వర్ణిం[6]చు [7]డవివేక [8]మెట్లుఁ
జెప్పఁ జిత్రం బగు శివరాత్రి మహిమ,-

మృగవ్యాధుని కథ

యొక్కమృగవ్యాధుఁ డురుకాననమున
గ్రక్కన[9]యొక్క మృగంబు వీక్షించి
శరమరిఁబోసి భాస్వద్దృష్టిముష్టి
సరససంధానకౌశలము వట్రిల్లఁ
[10]దొడిఁగి యేయుడుఁ గోల దోడన మిట్టి-
పడినమృగము నుచ్చిపాఱె తచ్ఛరము

౧. గనగదాంగుడుసభా వీథి, ౨. ట, ౩. మ్ర, ౪. కలవదవర్ణింపఁద, ౫. రు, ౬. త్రి, ౭. ట, ౮. మ, ౯. నొ, ౧౦. తొడగి (రి).

నక్క[1]న [2]నిమ్న భూస్థలి [3]నతి[4]నిద్ర
నెక్కొన్న కోల్పులి నెత్తిపైఁ బడుచు
బిట్టుల్కిపడి పరిస్ఫీతో[6]గ్రవృత్తిఁ
[5]గట్టలుగట్టి వ్యాఘ్రంబు శీఘ్రంబ
పైపడ నతిభయభ్రాంతి[7]నయ్యాలుకు
వే వాఱి యొకబిల్వవృక్ష మెక్కు[8]చును
దలచుట్టుఁ బెనురక్తధారలు[9]గ్రమ్మఁ
బులినొచ్చివచ్చి యా భూరుహాగ్రమున
నున్న [10]లుబ్ధకుఁ గని యురుకోపవహ్ని
గన్నులఁ గ్రమ్మ నుత్కటధూమలతలు
ముక్కున వెడల సముద్ధతి వృక్ష
మెక్కఁజూచుచు శాఖ లిడఁగమించుచును,
నఱిముఱి [11]నూఁచుచు, [12]నఱచుచుఁ, గఱచి
కఱచివైచుచు, నొడు గఱచుచుఁ. జుట్టి
చుట్టివచ్చుచును, మూల్గుచును, బోరసఱచి
బిట్టప్పళించుచు, బిల్వవృక్షంబు-
తో వాల మడఁచుచుఁ, దొట్రుకొల్పుచును,

---

౧. ని, ౨. నిమ్మ, ౩. నలి, ౪. నింద్ర, ౫. గట్టిలు, (6) ౬. మైయె, ౭. టయు, ౮. చర్వ, ౯. సూ, ౧౦. నానిని, ౧౧. మెరయుచు, ౧౨. నగచుచు.

[1]బోవక యిమ్మాడ్కిఁ బులియున్కి గలిగి
తా నెక్కవచ్చునే ధర నెట్లుఁ బులికి
నైన వృక్షాగ్రంబు ననక వ్యాధుండు
ప్రాణభయంబున భ్రమసి యాత్మీయ-
ప్రాణ[2]పాతోపతాపమున [3]వ్యాఘ్రంబు
నెట్టును బోనేర, [4]దెగురు, ప్రా[5]నెక్కుఁ,
బట్టుఁ, జంపును, దన్ను భంగించు, నొంచు
నంచుఁ దదీయబిల్వావనీరుహ స-
మంచిత స్కంధంబ హారమూర్తి గాఁగఁ
బులికిఁ జిక్కితి నని [6]పొగులుఁ, దచ్ఛోక-
జలబిందుతతులు మజ్జనజలంబులుగ
[7]ముఱు వైన [8]లేఁతపత్త్రిరిఁ ద్రుంచివైవఁ
దళోఁదళి నది నిరంతరపూజ[9]గాఁగ
భువిఁ జుట్టుముట్టెడుపులి యట్ల తిరుగ
నవియు సవ్యాపసవ్యములుగా మీఁద
నాహార[10]మారీతి నందు లేకునికి
నూహింప నదియ తా నుపవాసముగను

---

౧. మో. ౨. తాపోప, ౩. వ్యాగంబు, ౪. ది, ౫. కె. ౬. పొగలు, ౭. మరలైన; వరులైన, ౮. పత్త్రిరిమహి, ౯. నముగ, ౧౦. తిథియందు.

బనుగొన మృగముఁ దప్పక చూచిచూచి
కనుమూయకునికి నిక్క[1]ము జాగరముగఁ
బులి యేను జంపకపో నని యుండఁ
బులి కోడి యాతండుఁ [2]బోవరాకునికిఁ
దవిలి యకామకృతమునఁ [3]జెంచునకు
శివరాత్రి యది య[4]ట్లు సెల్లె జాగరము,
గందర్పహరుఁ డిట్లు గైకొ[5]నె, నెఱుకు
[6]బొందితోడ[7]న కొనిపోయెఁ; గావునను,
నెల్లరాత్రులయట్ల యీశివరాత్రిఁ
జెల్లునే కవితావిశేషతఁ బొగడ
శివరాత్రిమహిమ [8]యా శివుఁ డెర్గుఁగాక
తవిలి యిట్లొప్ప సంధ్యాకాలమునను
నత్యర్థిఁ బ్రణుతసంయముఁడు దోనయ్య
నిత్యలింగార్చనానియమముల్ దీర్చి
శ్రీలింగచక్రవర్తికి భక్తసత్క్రి-
యాలోలు శ్రీమల్లికార్జునదేవు
సంధ్యాయతాంభోదసద్వర్ణజూ[9]టు
సంధ్యోచితార్చనాసంతుష్టుఁ జేసి

౧. పు, ౨. బోవకయునికి; బోవరాకుండ, ౩. జం, ౪. ట్లచె, ౫. నియె, ౬. బొందె. ౭. నె, ౮. యీ, ౯. ట.

యంతఁ దదీయనితాంతోపమండ-
పాంతరంబునఁ బురాభ్యంతరంబునఁ[1] బు-
రాంతర దేవాలయాంతరంబునఁ బు-
రాంతికోద్యానవనాంతరంబులను,
భాస్వర సద్భక్తభవనంబులను, స-
రస్వతీవాహినీప్రాంత దేశముల,
సుఖతర గోపుర చూడా[2]గ్రహముల,
శిఖరశృంగా[3]టక సిద్ధశృంగముల,
రమణ సారంగేశ్వరము, [4]హాటకేశ్వ-
రమును, బాపవినాశనముఁ, గిన్నెశ్వ-
రమును, వారాహేశ్వరమును, సిద్ధేశ్వ-
రము, నాదియగు నీశ్వరస్థానములను
సల్లలితం[5]బుగా సమయ మిప్పించి,
పెల్లుగా ముగ్గులు వెట్టంగఁ బనిచి,
విదితలింగార్చ[6]నావేదికాస్థలులఁ
బదపడి బిందియల్, వడిగంబు, లర్ఘ్య-

౧. దురంతరాదేవాలయాంతరంబుల(న)ను, ౨. వ, ౩. దిప్ర, ౪. గుహేశ్వరము, సిద్ధేశ్వరము సుప్రసిద్ధమై భువిని, ౫. కీర్తు లు మీరు నివియాదిగాఁగ, రహివహించిన యీశ్వర......, ఇద్ధము లుగా, ౬. న.

పాత్రలు, నూతనభాండముల్, [1]వంశ-
పాత్రలు, ఘంటలు, బహు[2]ధూపదీప-
పాత్రలు, బహు[3]హాటకపాత్రలు రజత-
పాత్ర[4]లు, విడెములు, ఫలములుఁ, గజ్జ-
ములు, సుగంధద్రవ్యములు, సితపుష్ప-
ములు, మాలికా [5]సికము, లఖండబిల్వ
పత్రిరి, [6]పువ్వులుఁ, బంచామృతములు,
నుత్తమాక్షతలు, దివ్యోదనావళులు,
నతిసుగంధం[7]బు, దశాంగ, [8]మానంద-
వతి, సురభియును, నావర్తిధూపంబు,
మలయానిలంబును, మహిసాక్షి, [9]మద్ది,
గలహంసధూపంబుఁ, గామికామోద-
మును మనోహరధూపమును, దివ్య[10]ంధూప-
మును, జనవల్లభామోదదీపంబు
లాదిగా ధూపంబు లానందవర్తి *
యాదివత్తు[11]లును గృహాంగవస్త్రాది-
వాసస్సులునుగూడ వరభక్తతతి కు-
పాసనామతి సమర్పణసేసి, మఱియు

౧. పంచ, ౨. దీపధూప, ౩. హేమ, ౪. ముల్, ౫. నికర, ౬. ను, ౭. వు, ౮. ంబుగంధ... ౯. మడ్డి, ౧౦. భూప, ౧౧. ర్తు.

నేవస్తువులు ప్రియం బెప్పాడువలయు
నావేళ వారికి నభిమతార్థములు
సేయుచు నిబ్భంగి శివరాత్రిపర్వ
మాయతమతిఁ జె[౧]ల్లి నంత భక్తులకుఁ
గలపంబుఁ బన్నీరుఁ గస్తూరి సాందు
నలిఁ గూర్చి సమ్మార్జనము సేయువారుఁ
[౨]గళికలు, వస్త్రముల్, గమలముల్, బంధ-
ములు, ముకుళంబులు, ముత్తియంబులును,
నిగ్గారుఁబంచవన్నియలతోఁ గూర్చి
ముగ్గు లత్యాశ్చర్యముగఁ బెట్టువారుఁ,
దల[౩]కొని సంతతధారాసహస్ర
కలశాభిషేకముల్ గావించువారు,
శిష్టాగమోక్త[౪] విశిష్టత[౫]దనర
నష్ట[౬]విధార్చనం బలరించువారు,
నలి నుబ్బి భక్తగణప్రకరంబుఁ
దలఁచుచు ధూపా[౭]ర్పితము సేయువారు,
మంగళంబగు భక్తమండలి కనుచు
రంగత్కరముల నా[౮]రతు లెత్తువారు,

---

౧. ల్లై. ౨. కళ, ౩. కొని, ౪. శేవ, ౫. నలరి, ౬. పుష్పా, ౭. త్రి, ౮. శ.

సంచితభ[1]క్తిహితార్థకల్పనలఁ
పంచభక్ష్యాదు లర్పణసేయువారుఁ,
గర్పూరసహితంబుగా విడియంబు
లర్పించువారు, సొంపారంగ నిట్లు
[2]నాల్గవసరముల నలి శివరాత్రి
[3]నాల్గుజాములును సన్నుతిఁ జేయువారుఁ,
బ్రేమతో నాపగల్ రేయును జాము-
జామున కర్చనల్ [4]సరిసేయువారు,
ఘటిక లర్వదియును గలయఁ జెన్నొలయ
ఘటికావసరములు గల్పించువారు,
సముచితాష్టోత్తరశతసంఖ్య నవస-
రములు సంకల్పించి రతిఁజేయువారు,
నష్టోత్తరసహస్ర మవసరం[5]బులు వి-
శిష్టతమై న[6]ట్లు సెల్లించువారుఁ,
దఱిఁ[7]బూన్చుపూజయుఁ [8]దనరుపూజయును
వఱలఁ బూ[9]న్పఁగ నలవఱుచుపూజయును-
గా నిరంతరపరికల్పితార్చనలు

౧. క్తి, ౨. నాల్గుయామములు సన్నుతిసేయువారు; నాల్గు(లుగు) విధముల నానార్చనంబు, 3. నాల్గుజాలకు దేవును (న్నో)తియించువారు, ౪. సలిపెడి. ౫. తతి, ౬. ట్లచేయించు, ౭. జూచు, ౮. బ, ౯. న్చ.

నానందలీలఁ బాయక చేయువారు,
రతి షోడశోపచారక్రియార్చనలు
[1]సతతంబు నతిభక్తిఁ జలిపెడువారు,
నాది ఋగ్వేదాది నలరారుసూక్త
లాదిగా బ్రాహ్మణాద్యంతసూక్తములఁ
దుదిగాఁగ రుద్రసంస్తోత్రసూక్తములఁ
జదువు[2]చుఁ బొదలి [3]ప్రశంసించువారు,
రుద్రవిధాననిరూపిత న్యాస-
భద్రాత్మసంజ్ఞలు వదునొకంటికిని
గ్రమ మొందఁ జమకసూత్రంబు లేకాద-
శములు నొండొంటికి శాంతులుగాఁగఁ
దివిరి ఛందోఋషి దేవతా శక్తు
లవి గూర్చి బీజాక్షరాన్వితం[4]బులుగ
సద్రతి శ్రీశత రుద్రంబుఁ గూర్చి
[5]రుద్రంబునంద పురుషసూక్తములును
నా యజుర్వేద వేదాంతసూక్తములఁ
బాయకచదువుచుఁ బ్రణుతించువారు,
సామంబు దా వేద సామరహస్య

౧. నతిభక్తి సేయుడు నలరెడువారు, ౨. లు, ౩. ల; వి, ౪. గను, ౫. రుద్రుని బొగడు.

సామాదులగు [1]నవ-[2]సామాదులందు
ననునీశ్వరప్రశంసా[3]పరసూక్తు
లనుషక్తిఁ జదువుచు నగ్గించువారుఁ,
బ్రవిమలాథర్వశిరశ్శిఖాదులను
[4]దవిలి శ్రీపాశుపతవ్రత వరదు
శ్రీరుద్రమహిమయుఁ జెప్పుసూక్తములు
వారక చదువుచు వర్ణించువారు,
నంచితబాణ గ, ద్వ్యాక్షరగద్య,
వంచగద్యాదులుఁ బటుగణాడంబ-
రంబు, వర్ణాడంబరంబు, వ్యాసాష్ట-
కంబును, శ్రీనీలకంఠస్తవంబు,
శ్రీరుద్రకవచంబు, శారభంబును, మ
యూరస్తవము, హాలాయుధ, మనామయము,
మలహాణంబును, మహిమ్నం బను స్తవము,
మలయరాజీయంబు, పూనిదండకము,
స్తుతిమూలమగు మహాస్తోత్రసూత్రముల
శతకంబు, శివతత్త్వసారంబు, [5]దీప-
కళిక, మహానాటకము, నుదాహరణ

౧. సవ, ౨. నామ, ౩. వర, ౪. తివిరిరుద్రపసుపతి...
౫. దేవ.

ములు, రుద్రమహిమయు, ముక్తకావళులు,
గీతసూక్తములు, భృంగిస్తవంబులుఁ, బు-
రాతన మునిముఖ్య రచితాష్టకములు,
హరలీల, రుద్ర సహస్రనామాదు,
లరుదొందఁ జదువుచు నంకించువారు,
నరుదగు దాసయ్య [1]నఱువత్తుమూఁడు
చరితంబులును, శ్రీబసవ పురాణంబు
నేలలువట్టంగ నింపుసొంపారు
[2]శైలిచేఁగ్రాలుచుఁ జదివెడువారుఁ,
చాతుర్యమెసగఁ బసవ దండనాథు
గీతంబు లాదిగా గీతా[3]దు లైన
సకలపురాతనచారుగీతములుఁ
బ్రకటించి ప్రకటించి పాడెడువారుఁ,
జదువులఁ బాటల సంగతిలేమిఁ
బొదలి మాటలయంద పొగడెడువారు, *
నామాటలకు మనం బంద[4]మి మల్లి-
యా! మల్లయా! మల్లయా! యనువారు,

---

౧. నరవత్తుమునురి, ౨. శైలంబు ఘూర్ణిల్ల, 3. ధ్యు;-ధ్యు, ౪. గా, * ఈ పాదము తరువాత ఒక ప్రతిలో, "హరలీలఁ బాడుచు నట్లునుగాక" అని అధికపాఠ మొకటి ఉన్నది.

"జయ! జయ! యుఘో! జయ! జయ! జయ!" యనుచుఁ
జయవెట్టి[1] మ్రొక్కుచు సరిఁబేర్చువారు,
నలరుచుఁ [2]బడిహారులట్ల యందఱును
లలి నుబ్బి చాంగు భళా యనువారుఁ,
దన[3]రుశబ్దము గద్గదంబున వెడల
కునికిఁ దప్పక చూచు చుండెడువారుఁ,
జూపులు శివసుఖాశ్రు[4]లవెల్లి ముంప
నాపోవ[5] కెగయుచు నాడెడువారు,
నెగయంగ[6] నెగయంగ నెంతయుఁ గాళ్లు
నెగయక యన్నెక్కి యిల వ్రాలువారు,
నాటలాత్మీయసర్వాంగవి[7]స్ఫురణఁ
బాటి[8]దప్పినఁ జొక్కి పడియెడువారుఁ
జప్ప[9]ట్లు వెట్టంగఁ జక్కన లేచి
యప్పాట వెడ[10]యాట లాడెడువారు,
వేడుకతోఁ జిందు[11]వాడంగ నుబ్బి
కోడంగియా[12]టలఁ గునిసెడువారుఁ,

---

౧. ట్టు, ౨. ఫణిహారు, ౩. ర, ౪. లు, ౫. ల, ౬. నొగ, ౭. స్మ, ౮. దప్పకటొ, ౯. టల్, ౧౦. లంగనా, ౧౧. లా, ౧౨. లు.

బ్రన్నని నిజదేశభాషల జ[౧]తుల
కన్ని[౨]కోడంగాట లాడెడువారు,
భ్రమ[౩]రముల్ [౪]సాళెముల్ బయక[౫]ముల్ మెఱసి
రమణఁ బంచాం[౬]సి పేరణి యాడువారు,
ప్రమథ పురాతన పటుచరిత్రములుఁ
గ్రమ మొంద బహునాటకము లాడువారు,
లలితాంగ రసకళాలంకార[౬]రేఖ
లలవడ బహురూప మాడెడువారుఁ,
[౭]గరణముల్ [౮]మెరవణుల్ గతు[౯]లుఁజిత్రము[౯]లు
నరుదుగ [౧౦]వెడ్డంగ మాడెడువారు,
నమరాంగనలు దివి[౧౧] నాడెడు[౧౨]మాడ్కి
నమరంగ గడలపై నాడెడువారు,
నా వియద్గతిఁ బత్తు లాడె[౧౩]డునట్టి
భావన[౧౪]మ్రోకులపై నాడువారు,
భారతాదికథ[౧౫]లఁ [౧౬]జీరమఱుఁగుల
నారంగ బొమ్మల నాడించువారుఁ,
గడు నద్భుతం[౧౭]బుగఁ గంబసూత్రంబు

---

౧. త, ౨. బో, ౩. రులు, ౪. జా, ౫. న, ౬. లే, ౭. కరములు, ౮. మెర(ద)ములు, ౯. ల, ౧౦. వేదాంగ; సిద్ధాంగ; వెండాంగ, లెడ్డంగ, ౧౧. గియా, ౧౨. పగుది. ౧౩. డియ, ౧౪. మ్రొక్కు, ౧౫. ధరు, ౧౬. చిరతరమరగు, ౧౭. ంబగు.

ఒడరంగ బొమ్మల నాడించువారు,
నాదట గంధర్వయక్ష విద్యాధ-
రాదులై పాడెడు నాడెడువారు,
విధమునఁ బ్రచ్ఛన్నవేషముల్ దాల్చి
యధికోత్సవము [1]దులు కాడ నట్లాడు

ఆటపాటలు

శిరమున నురమునఁ జెవులఁ గంఠమునఁ
గరములఁ గూఁక[2]టిఁ గాళ్లఁ జెల్వారఁ
గవదండలును గనుఁగవ [3]గరణికలు
[4]సవరంబులును గలశంబు[5]దండలును
భసితం[6]బుపూఁతపైఁ బరగు [7]బచ్చెనలు
నసలారు [8]చిఱుగజ్జియలు నందియలును
సరి రత్నపంక్తుల జలపోసనములుఁ
గర మొప్పు తొంగళ్లుగల చల్లడ[9]ములుఁ
బొల్చుదంతావళుల్ పుష్పమాలికలుఁ
దాల్చి యత్యద్భుతోత్సవలీల దనర
జనులు హర్షింప నాస్థానముల్ సొచ్చి
యనుకూలవివిధ[10]వాద్యసమేళనమున

౧. దొ, ౨. లు(ల), ౩. కరు, ౪. జవ, ౫. దండంబు, ౬. ంపు, ౭. పచ్చ, ౮. కిరు, ౯. ంబు, ౧౦. విద్యామేళ.

## పర్వత ప్రకరణము

నార్భటుం బిచ్చి యొయ్యన జవని[౧]కల
గర్భ[౨]బు పడ[౨]లి యక్కజము వట్రిల్లి
నాడకముంద[౩]అ నభినయ[౪]యం బాలయుఁ
జూడకముంద[౩]అఁ జోద్యంబుదనర
నిక్కుచును ద్రిభంగి నిలుచుచు నట్ల
చొక్కుచు సభఁ జూచి యొక్కింత నగుచు
నలి నంగసంచలనము నంద గతులు
లలి గొని భ్రూలతలన నర్తనంబు
మొనయుచిత్తోల్లాసమున[౫]ను రంజకత
దనరఁ గటాక్షంబు [౬]నను గుశలంబు
బలరి శిరఃకంప మాచరిం[౭]చుచును
నలి నంగుళిస్ఫోటనంబు సేయుచును
లాగు, [౮]వంజళము, [౯]ఘాళము, [౧౦]వళి, దిరువు,
బాగు, [౧౦]వాహిణి, సాళి, [౧౧]బయగతి, సుగతి,
బహుగతి, గతి[౧౨]తియు నాఁ బరిపాటి దనర

### భరతశాస్త్రలక్షణము

సహజమై తనుగతి స్వర[౧౩]వంచనములుఁ
బటురసాలంకారభావముల్ దనర

---

౧. ఖు, ౨. లన, ౩. ట, ౪. వం, ౫. న; స, ౬. ననకలశంబు; ననుకుశలమ్మి, ౭. ంపు. ౮. పంజ, ౯. ఘాళం, పళి; వడి, ౧౦. వహిణి, (ణ), ౧౧. పయు, ౧౨. యనా, ౧౩. పంచక.

స్ఫుటవాద్యతాళసంఘటన ఘటిల్లఁ
[1]దనుపాదఘట్టన దనరుసుద్ఘటన-
లను[2]నయించుచు నందియల్ గదల్చుచును
'నోహో!' యనుచు గతు [3]లాడ్డవిం[4]చుచును
'నాహా!' యనుచు లాస్య మనునయిం[5]చుచును
జతులు[6]వాడుచుఁ దాళగతుల-కొాడుచును
శ్రుతులఁ గూడుచు నేలఁ ద్రొ[7]క్క నొడుచును
వీఁగుచుఁ గరణికల్ విస్తరించుచును
లోఁగుచు దంతావళుల్ నటిం[8]ఫుచును
బొబ్బలు[9]వొడుచుచుఁ బొంగి యార్చుచును
[10]గుబ్బన లేచుచుఁ గునిసియాడుచును
జాఱు[11]చు జంగ[12]లు సాఁపుచు, మంది
నూటించుచును, మొగం[13]బొఱవ్రచ్చుచును
జంకఁ జూపుచు బయల్ సప్పరించుచును
జంక ల[14]డిచికొనుచు శంకరుఁ బాడు
చును, నుఱుకుచుఁ, గ్రేళ్లుసూపుచుఁ, బన్ని-
కొనుచు, గంతులువైచుచును, మణికట్లు

౧. తన, ౨. నటిం, ౩. లోడ, ౪. పు. ౫. బా, ౬. నా, ౭. కి-కా, ౮. ంపు, ౯. వడ, ౧౦. సుబ్బు, ౧౧. లు, ౧౨. లే, ౧౩. బొరవచ్చు, ౧౪. దనుకొంచు.

[1]వెడమఱించుచు, వ్రేళ్లు విడికిలించుచును,
నొడలడంచుచు, నురం బొగ్గుచు, వీఁపు
విఱిచికొనుచుఁ బురివిచ్చుచు, మోము,
బొఱదుపుచ్చుచు, భుజంబులు[2] బవియుచును,
ప్రోఁకాళ్లఁ దొడలును ముడివ[3]ఱుచుచును,
గూఁకటెఁ గిఱుపుచుఁ, గొక[4]రటించుచును,
మూఁతులు[5]నలుపుచు [6]మురుకటింపుచును
ప్రోఁతకు నుబ్బుచు మురియుచుఁ జనుచు
మిన్నక చూచుచు మెడవిర్చికొనుచుఁ
గన్ను లార్చుచుఁ జెవుల్ గత్తరించుచును
[7]వెవ్వెఱ[8]లాడుచు [9]వెక్కిరించుచును
[10]గవ్వదండల[11]యందు గతులు వుచ్చుచును
బొమ లెత్తివైచుచు బుగ్గరించుచును
దమకించి దాఁటుచు దండ [12]లిచ్చుచును
గొంకుచు వడఁకుచుఁ గొసరుచు, మూఁడు
వంకలఁ బోవుచు శంకించుకొనుచుఁ

---

౧. వెడ, ౨. బరి, ౩. వడికొనుచు, ౪. రిం, ౫. సు[illegible]పుచు, ౬. ముర (రు) కడింపుచును, ౭. వెప్పర, ౮. లాటుచు; నాడుచు, ౯. వెక్కి (క్కు), ౧౦. గవ్వన తమతమ, ౧౧. యంద, ౧౨. ఝు.

బరులఁ జే[1]వ్రేయుచుఁ బకపక నగుచుఁ
గరముబ్బుచును జొల్లు గాఱఁచికొనుచు
నరసంబు లాడుచుఁ జప్పట లిడుచు
విరసంబు లాడుచు విఱ్ఱవీఁగుచును
నొడ్డోలగంబులో నొఱసి తిర్గుచును
నడ్డంబు [2]ద్రికటంబు నన్ని[3]వాడుచును
మరగాళ్ల[4] నడచుచు మట్టిగా[5]ళ్లగుచు
[6]నోరుగాళ్ళ[7]నడచుచు ధర[8]గొంతుగొనుచు
మ్రోఁకాళ్ల నడచుచు మొగి[9]నేలఁ గాళ్లు
దాఁకుచుండ నెగసి తటు[10]కన చనుచుఁ
గూర్చుండి నడచుచుఁ [11]గుప్పించి యచట
నార్చుచు[12]మెఱము లందంద వైచుచును
నురమున నడచుచు [13]నొదికిలఁ జనుచు
ధరఁ బొరలుచు సముద్ధతి లేచి [14] చనుచు
నుర్విఁ ద్రిప్పటమున [15]నొకవ్రేల యిడి య-
గుర్వుగాఁ దిరుగుచు [16]గుర్వించు[17]కొనుచు

---

౧. వే, ౨. విగ, ౩. వాఁరు, ౪. గాల, ౫. లగుచు, ౬. నోరి, ౭. గొత్తు, ౮. కాళ్ల నేల, ౯. కునఁజనుచు, ౧౦. గుంపించి, ౧౧. మొ, ౧౨. నోడకుంచనుచు; నొదికిలి (నొతికల) జనుచు, ౧౩. నగుచు, ౧౪. ట్లొక, ౧౫. గుర్పి (ప్పి) ంచు, ౧౬. వనుచు.

గరతలం బా౧ని శీఘ్రమ సారియట్లు
ధరఁ దిరుగుచు దెసల్ దన్ని నిల్చుచును
ధర బొమ్మరమునట్లు దల క్రిందు౨సేసి
తిరుగుచు ౩వెలిదన్ని తివుట౪నిల్చుచును
౫నమిలియుఁబోలె నున్నతి నటించుచును
భ్రమరంబు క్రియఁ౬ను దాఁ బరిఘటించుచును
జిలుకయుఁబోలెఁ జెన్నొలయఁ బల్కుచును
జలచరంబులువోలె జనుల కుల్కుచును
గలహంసయునుబోలె గతుల౭నేర్చుచును
నిల మృగమ౮ట్లిరిమిరిమి చూచుచును
గండుఁగోయిలవోలెఁ గడఁగి కూయుచును
వెండి క్రోతియుఁబోలె వికృతిసేయుచును
నాలఱేఁడునుబోలె నటయిటసనుచు
౯గోలికాఁడునుబోలె ౧౦గోర్కెనఁ గొనుచు
మదగజంబునుబోలె మాఱుమలయుచుఁ
బొదలి వ్యాఘ్రంబట్ల పొఱి ౧౧నులియుచును
గేసరివోలె ౧౨లంఘించి పట్టుచును

---

౧. రి, ౨. లేచి, ౩. దవి; దివి, ౪. నిచ్చు, ౫. నమ, ౬. రాగ, ౭. నెంచు, ౮. ట్లరిమిరివి, ౯. కూలి, ౧౦. కూర్మి (ర్మె)ని, (న); కూగోల, ౧౧. నొ, ౧౨. జం.

మాసటీఁడునుబోలె [1]మడ్డి[2]వెట్టుచును
మహిభుజంగముఁబోలె మలకలుగొనుచు
విహగంబుక్రియ నభో[3]వీథిని జనుచు
సరి విలాసినిఁబోలె [4]సభ మురియుచును
[5]వరవిటునట్లు భావము లరయుచును
గవియట్ల నవరసగ్రాహకుం డగుచు
శివయోగియట్టు[6]లు సిఱునవ్వ నగుచుఁ
బగలేనినృపు[7]నట్లు పరిణమించుచును
బొగలేని[8]వహ్నియుఁబోలె మించుచును
[9]ఛాయలేనివెలుంగుఁ జాళిఁ గప్పుచును
మాయలేని[10]పురారి[11]మాడ్కి నొప్పుచును
బురములు[12]గాల్చినపోల్కి యాడుచును
మరుఁ[13]జిఱువుచ్చినమాడ్కి నాడుచును
సతి కర్ధ మిచ్చిన చంద మాడుచును
యతులు గొల్వఁగ నున్నయంద మాడుచును
నంధకాసురుమదం బడచు టాడుచును
గంధగజాసురుఁ గడపు టాడుచును
జన్నంబుఁ[14]ద్రుంచిన చా[15]ళ్ళి నాడుచును

౧. మండ, ౨. లె, ౩. వీథుల, ౪. సభలజేయుచును, ౫. వరలినయట్లు, ౬. లచి, ౭. నట్లప, ౮. యగ్ని, ౯. ఛాయ, ౧౦. శివుని, ౧౧. మాయ, ౧౨. గొ. ౧౩. జార; జుజ్జు, ౧౪. ద్రుం, ౧౫. లియా.

[1]వెన్నుండు గన్నిచ్చు వేళ నాడుచును
గరళంబు దాల్చినకరణి యాడుచును
సరి నజుతలఁ గొన్న [2]సరణి యాడుచును
వెండియు భవు బహువిధ[3]చరిత్రము లఖండిత[4]గతి నాటకంబు లాడుచును
భృంగియు నభిమతప్రీతి[5]మర్త్యంబు
[6]భృంగుల[7]లోఁ దాను భృంగియై[8]యాడ
వీణోత్తమ[9]ము, బ్రహ్మవీణ, కైలాస-
[10]వీణయు, సారంగవీణయుఁ, కూర్మ-
వీణయు, [11]నాకాశవీణ, [12]పినాక-
వీణయు, రావణవీణయు, గౌరి-
వీణయు, [13]గాంధర్వవీ[14]ణయు, [15]బాణ-
వీణయుఁ, గాశ్యపవీణ, స్వాయంభు-
వీణయును, భుజంగవీణయు, భోజ-
వీణయుఁ, గిన్నరవీణయుఁ, [16]ద్రినరి-
వీణ, సరస్వతివీణయు, [17]మొల్ల-

---

౧. వెన్నునిక, ౨. చరితమౌ, ౩. విచిత్రము, ౪. మతి, ౫. నత్యంత, ౬. క్రం, ౭. లోనదా, ౮. యాడు, ౯. యు, ౧౦.వీణె (ఇక్లై ఈక్రిందను), ౧౧. నుపినాకవీణయునాక, ౧౨. యు మార్గ. ౧౩.గం, ౧౪.గానంద, ౧౫. జా, ౧౬. ద్రిపరి, ౧౭. బొల్ల; మొల్లి.

వీణ, మనోరథవీణయు, సరథి-
గణనాథవీణయుఁ, గౌమార[1]వీణ,
యణివాణి, రావణహస్తంబుఁ. [2]దిపిరి,
[3]సకనెయు, వళి, విచిత్రక, నటు, [4]సాగ-
[5]రికయుఁ, [6]గుంఛిక, విపం[7]చిక, [8]సరవీణ,
[9]వరవాదివీణ, మల్ల[10]రియుఁ, గోలాప్టి,
[11]స్వరమండలంబు, ఘోషావతి యను వి-
ధంబు, [12]నౌదుంబరి, [13]దంత్రిసాగరము,
నంబుజవీణయు, నాదిగా మఱియు
నమరంగ గీతానుగము, నుభయాను-
గము, [14]ముఖవీణానుగము, [15]ద్రుతానుగము
[16]లన లక్షణోక్తము లనుచుఁ బ్రమాణ-
వినియోగ మనుతంత్రులును, [17]గరణికలుఁ,
జెలువారు దండియుఁ జిత్రంబు, మృదువు,
లలియు, మాధుర్య, [18]ముల్లసనంబు నోల[19]యు
సయతాణమును, మొగచాళంబు, సుకళ,

---

౧. రి, ౨. దివిరి; ద్వారి, ౩. చకనేయు; వకచేయు, ౪. నాగ, ౫. తి, ౬. నంచిక; గుంచిక, ౭. ంచ, ౮. నర(ర్ర), ౯. పరి, ౧౦. యకులాష్ఠ; యకోలాష్టి; యసుల్లాష్టి, ౧౧. సర, ౧౨. కౌదుంబర(రి). ౧౩. తంత్ర, ౧౪. మణి, ౧౫. స్రు, ౧౬. లను, ౧౭. కణికలును, ౧౮. ల, ౧౯. యు.

హాయతాణమును, దశహారము, సారణముఁ,
బొట్టివణిగ, దిరు[౧]వ్రును, [౨]వత్రి, దాళ
[౩]పట్టె, కర్తరియు నేర్పడ, జన్యజనక
విరచనల్ దళుకొత్త వీణాఢ్యులైన
నరులలోఁ గలసి కిన్నరులువాయింప
నచ్చుగా మును శవణాంగముల్ మెఱసి
మెచ్చులు వడయుచు మృదుమ్రోల మఱియు
ముదమున సమహస్త మును[౪], సైరణంబుఁ,
బదము, నంతరమును, బారణ, [౫]దోర్త్తు,
గలితంబు, జతియు, [౬]ద్రుక్కరముఁ [౭]గచ్ఛంబు,
[౮]మలపంబు, ముఖవాద్య, మిలఁ జల్లణంబు,
బొల్లావణియు, మలపును, వి[౯]ంబర్హణము,
నుల్లంఘి, యనుఘాత యుత్తాళ, విషమ -
వాణియు, నర్ధార్ధవాణియు, నర్ధ -
వాణియు, దళుకుంభవాణియు, దండ -
హస్త, జోవాణి, సమగ్రత, [౧౦][౧౧]బిండ -
హస్త, చంద్రాణియు, [౧౨]సజవతి, పంచ -

---

౧. పు. ౨. ష. (సు) త్తి, ౩. పట్టు, ౪. చైరన, (స; వ) ంబు; బైరవంబు, ౫. వో, ౬. ద్వ; జ, ౭. గచ్య; కచ్ఛ, ౮. మల దంబు; పలపంబు, ౯. డ, ౧౦. మ, ౧౧. బండి, (ండి), ౧౨. నప జత; నవనిజ.

హస్త, ౧శిరో౨వధి, యంత౩రావృత, వి-
హస్త, ౪పయిశ్ఛేది, యాస్థానగర్భ,
జతి, ౫పాజ, జలపాణి, సమపా౬ణి, ౭భేద-
గతి, వరి౮క్రమమును, గర్భనిర్ణయము,
లను బంధములును బుష్పాంజ౯లి యాదిఁ
జను ప్రబంధము, ఖండజతియు, రేగువణి,
దుడుకు, ఘీంకారంబుఁ, దుదిఁ జమత్కార
మడరంగ వాద్యమాడాదు౧౦లు మెఱసి,
నరులట్లు భరతుండు నందికేశ్వరుఁడు
ధర మద్దెలలతోడఁ దారు౧౧వాయింప
స్ఫుటతరంబుగఁ జంచుపుటయును, ౧౨గచ్ఛ-
పుటయు, ౧౩షడ్గీత, యుత్పుటయును, మోచి-
తయు, సమతాళ, సత్రచ్ఛేద, యనఁగఁ
బయిపయి నీయేడు ప్రథమతాళములు;
నోడఁబడ మఱి౧౪యెగయును, బొంబడయును,
3 నెడ, ౧౫వాడయును, ౧౬గారు, హడకయు, బంధ-

౧. దదీయాంతరావృత విపలి, ౨. శిరోదధి; శిమో; వలి, ౩. రవుపరి, ౪. రయంభేరి; వయంచ్ఛేరి, ౫. బోజ బొజ్జ, ౬. హాణి, ౭. భేదు, ౮. శ్రయ. ౯. లులా, ౧౦. ల, ౧౧. వా, ౧౨. జాచ; జౌర, ౧౩. నుగ్గతితయుద్భరిత; షడ్గతియునుత్పుటిత, ౧౪. యగ, ౧౫. హాడ; పాడ, ౧౬. గామహాడకును.

కరణ, [౧]బాడకరణ, క్రౌంచపదంబు,
సరకరణయును, నాస్థానమండపము,
ఘలి, చక్రవా[౨]ళంబుఁ, గలహంస, యార్యా
లలితయు, [౩]సరళ, విరళ, యుమ్మామంది-
రయు, మత్తమాతంగ, [౪]రథ్య, మత్తె, ముద
[౫]వయు, [౬]బంధమత్తెంబు, వరరూపకంబు,
నలరు నేకతాళ, [౭]మఠతాళ, మనఁగ
నిలు శుద్ధతాళంబు లిరువదియేడు;
[౮]ఖండితతర, యవఖండ, గంకాళ,
ఖండిత, చండ[౯]కీ, ఖండవర్ణ, యవి
ఘూర్ణితయుఁ, [౧౦]గుటిల, ఘూర్ణిత, [౧౧]గోష్ఠి,
యార్ణ, [౧౨]కచ్ఛణ, యాణ, [౧౩]యాదిమాతృక, త-
రక్షణపుత్రి, యు[౧౪]ద్వీక్ష, ణోచ్ఛవటి
యక్షోళిక, చటిక, యష్టిక, పూర్వా-
[౧౫]కంకాళ, మణిమిశ్రకంకాళ, ఖండ-

---

౧. బాద, ౨. కం, ౩. నరరవళ; సరళ(రళ) వళ, ౪. రచ్ఛమత్తెముద; రచమరెవలను; రచమధ్యముద్ర, ౫. రయు, ౬. బింఘ, ౭. మఠ, ౮. ఖ (భ)ండా(ం)త(ర), ౯. కి. ౧౦. కుటువేరి ఘూణిత; కుటిలరేఘా (ఖా)ణి (ర్ణి)త, ౧౧. గొడ్డ(ట్టి), ౧౨. ర(క) చ్ఛిణ; రచ్ఛర; వకచ్ఛణ, ౧౩. యానియత్యంత; యణయాదియా (మా) త్రు. ౧౪. ద్వీక్షణచచటి; దీక్షణోచ్ఛచటి, ౧౫. యక్షా (క్ష) రిచ్ఛ (కచ), దికం.

[౧]కంకాళ, కావ్యకంకాళ, [౨]పంచాళ,
[౩]భిన్నక, కోకిలప్రియ, నిరవద్య,
రన్న, కుంజర, ఫణిరాజ, చతుశ్ర-
ధార, కృత్తి, [౪]చప్పవిద్యాధర, రక్త-
[౫]ధార, యుత్తమమేరు, తాంబూ[౬]లియాణ,
మలపు, నుత్ఫు[౭]ల్లక, మాతంగ, యర్ధ-
కళిక, సరస్వతి, గంతాభరణయు,
మిశ్రతాళయును, సంమిశ్ర[౮]వాద్యయును,
మిశ్ర[౯]కళాస్ఫూర్తి, మిశ్రవర్ణములు,
సింహావిక్రీడిత, సింహానాదయును,
సింహానందకయు, లక్ష్మీస్తన, ముక్త
తాళ, పంచబ్రహ్మ, దశ[౧౦]వృద్ధ, పంచ-
తాళ, చాయ[౧౧]ణ, పరితాళ, ప్ర[౧౨]సక్త,
[౧౩]ఖుర, విసరఖుర, యుత్తర, పంచ[౧౪]వాణ,
హారిణ, [౧౫]మాయాఖణ, [౧౬]యాదికం[౧౭]ఖాణ,

---

౧. కంకణ; కంకాణ, ౨. పంచాళి(ణి), ౩. భిన్నక (౦) కా (కో) కిల, ౪. చ, ౫ దార, ౬. ల (లి), యరణ, ౭. ల్లి. ౮. వాద. ౯. నత్త (ర్త) రియును. ౧౦. రుద్ధ, ౧౧. న, ౧౨. శక్తి, ౧౩. ఖురు విపముఖర, ౧౪. వాణ్య; బాణ, ౧౫. మణేయాకణ; మాఖాణియాణ, ౧౬. మా, ౧౭. కా.

[౧]ఖంజర, చతురశ్ర [౧]ఖంజర, కృష్ణ -
[౧]ఖంజర, యసమాన [౧]ఖంజర, తాళ,
లక్షి[౨]వతియు, ధ్రువ, [౩]లయ, తనుభద్ర,
లక్షిణి[౪]యాణ, వి[౫]లంబిత, [౬]యాది,
మఠ్యె, వళీ, [౭]ధ్రువమఠ్యెయు, జంపె-
మఠ్యెయు, మునుతెగ మానం[౮]బు మఠ్యె,
యుని యిట్లు ప్రథమశుద్ధాది విభంగ -
వినుత భంగాభంగ వివిధతాళములు
సన్నుతాష్టోత్తరశతసంఖ్యఁ జనఁ బ్ర -
సన్నతాళము దూర్య సంగతిఁ జెలఁగ
భాసురం బగు [౯] జాతి వాస, [౯]విజాతి-
వాసయును, గుమారవాసయుఁ, బతు-
వాసయును, భువనవాసయు, శ్వేత-
వాస, భాస్కరవాస, వరరుద్రవాస,
హరివాస, నిధివాస, యష్టదిగ్వాస,
గర మొప్పు ఋషివాస, గార్తికవాస,
జనను[౧౦]తాఘోరవాసయు, బ్రహ్మవాస,
సెనసి త్రిపురవాస, శివ[౧౧]భక్తివాస,

౧. కం, ౨. స, ౩. శాయసుభద్ర, ౪. య, ౫. శం, ౬. దా, ౭. ధృతి, ౮. ంపు, ౯. జ్యో, ౧౦. త, ౧౧. శ.

[౧]వాలితభువనా[౨]ధిపతివాస, యనఁగ
వ్రాలి యష్టాదశ [౩]వాస[౪]నాదములు;
[౫]ఆలాప, హేలనా, వ్యాప్తి, బెడంగు,
[౬]చాలన, [౭]సుళికెయుఁ, జర, మింపు, [౮]సొంపు,
[౯]నణువు, [౧౦]దిరువు, జయ, యనుజయ, [౧౧]కొంకు,
[౧౨]వృణవ్రాణ, వళి, [౧౩]భజ[౧౪]వణ, [౧౫]పొంవు, [౧౬]సెవణ,
[౧౭]వహాణి, స[౧౮]వ్యాంగుళవహా[౧౭]ణియు, [౧౯]నధర
[౧౭]వహాణియు, నా నిఱువది రెండుగతులు,
స రి గ మ ప ధ ని స సప్తాక్షరములు;
నరయంగ నారోహి, యవరోహి, సక్ర-
వాళ, సంపదలఁ, బ్రవ్యా[౨౦]క్త, సువ్యా[౨౦]క్త,
[౨౧]లాలిత, నొప్పు సప్తాలాపనములుఁ;
దెలియ నల్వదితొమ్మిది విధంబు లందు
దళుకొత్తు[౨౨]హంసనాదంబు లింపారఁ
జనఁగ షడ్జమును ఋషభయు గాంధారి

౧. వ్రాలిన, ౨. ది, ౩. వాస; వాంస, (శ), ౪. చాపములు, ౫. హేళావ; ఆపాప, ౬. నా; బా, ౭. సురిక, ౮. నుం, ౯. అణువు (పు), ౧౦. తిరుపు, ౧౧. కొంక, ౧౨. పుణపూ్రాణ, బణయాణ, ౧౩. భన్నె, ౧౪. వణి, ౧౫. యింపు, ౧౬. సెవణ, ౧౭. పహాణ, ౧౮. ర్వా, ౧౯. ది, సదర, ౨౦. స్త, ౨౧. నాలీల, ౨౨. వంశ.

యును మఱి మధ్యమంబును బంచమంబు
ధైవతమ్మును నిషాదము[౧] నాఁగ నిట్లు
భావింపఁ బరగు సప్తగ్రామ జనిత -
ములు, [౨]నుదితస్వరంబులు [౩]పుట్టుకాల
ములు, దిథి, నక్షత్రములు, యోగములును,
జాతిభేదములు, స్వజాతిస్వరములు,
జాతులుఁ దనర నాస్వరములలోన
సకళయు, గూఢ, నిష్కళయు, సంపూర్ణయుఁ,
బ్రకటింప షడ్జసంభవములు నాల్గు;
నావళి, మధుర, యేకాక్షరి నాఁగ
భావింప ఋషభ సంభవములు మూఁడు;
భృంగిజాతియును [౪]బరేంగిత యనఁగ
సంగతి గాంధారజనితముల్ [౫]మూఁడు;
సనఁ బూర్వ[౬]వాసరంజ[౭]క యలంకారి
[౮]ని, నాఁగ మధ్యమజనితముల్ మూఁడు;
వర రేణుకయుఁ బ్రస్తవాసియు లలిత,
స్వర[౭]వాసి, పంచమజనితముల్ నాల్గు;
దనరుభాషాగ్ని, నర్తకియు, నాపూర్ణ

౧. సునానిట్లు, ౨. సందతా, ౩. పుట్టి, ౩. బ(బు)ర్రాంగతి, ౫. రెండు ? ౬. రాశి, ౭. ల, ౮. నాద.

యును, నాఁగ ధైవతజనితముల్ మూఁడు;
వరుసఁ బ్రచ్ఛన్న సర్వవ్యా¹ప్తు లనఁగఁ
బరగు నిషాదసంభవములు రెండు;
దలఁప సప్తస్వరాత్మకములై యిట్టు
లిల నొప్ప శ్రుతులు²దా మిఱువది రెండు;
దీర్ఘ, లాలితయును, దీర్ఘ, కాదీర్ఘ,
దీర్ఘోల్లసితమును, దీర్ఘకంపితము,
నుల్లసితంబు, సమోల్లసితంబు,
నుల్లాసితంబును, నుచ్చరితంబు,
స్ఫురితమూ³ర్ధ్వక్షిప్తమును, గోమలంబు,
⁴వరుస నక్షిప్తంబు, ⁵భ్రమిత మాహతము,
లలితోత్తమంబును లలిత, ప్రస్తుతము,
నలరుగుంఫితము, సూక్ష్మాంతంబుఁ, గుంచి -
తము, గరస్థితము, నాఁ⁶దత్కృతిసంభ
వము లిఱువది రెండు గమకముల్; మఱియు
ధరఁ గంపితము, స్ఫురితము, లీన, మనఁగ
సరిఁ ద్రిభిన్నోత్తర సప్తధా యనఁగ
నలరునాందోళితాహతమును, సూక్త

౧. ప్తు, ౨. దా, (నా) నిరు, 3. ర్ధ్వ, ౪. పరగు, ౫. భ్రమ రహాహతము, ౬. దచ్ఛృతి.

కలనముల్ ప్రత్యేకగమకము లేదు ;
సురుచిర తత్పర శ్రుతి గమక ప్ర-
కరగీతజాత రాగప్రభేదములు,
శ్రీరాగ, మాందోళి, సిత్రాంగి, లలిత,
సౌరరాగము, గౌళి, శంకరాభరణ,
గాంధారి, మధ్యమగాంధారి, రక్త -
గాంధారి, వంచమగాంధారి, దేవ -
గుప్త, శ్రీకాంశికగుప్త, గాంధారి -
గుప్త, సాధారణగుప్త, గన్నడిక, —
దేశి, గుండకము, ధన్నాసి, గాం[౩]భోది,
దేశాక్షి, మధుకరి, [౪]దివి మేఘరంజి,
రంగవరాళి, ధరంగిణి, బహుళి,
బంగాళ, మాహు[౫]రి, [౬]బ్రహ్మాణి, శుద్ధ -
వాహి[౭]ని, బృ[౮]హతి, [౯]దేవప్రియ, రూప,
[౧౦]సోహరి, సైంధవి, శుద్ధ[౧౧]వరాళి,
సౌరాష్ట్రసైంధవి, వౌరాణి, భిన్న -
పౌరాణి, యుత్ప[౧౨]లి, వదపంజరంబు,

---

౧. లిత, ౨. ళి, ౩. మో, ౪. దమి, ౫. ళి, ౬. బ్రాహ్మణి, ౭. ణి, ౮. వ, ౯. దే(రే)వక్రియా, ౧౦. సోహహ, ౧౧. వి, ౧౨. ళి; ల.

నాగవరాళి, కర్ణాటవరాళి,
నాగ౧దవికురంజి, నాట, త్రినేత్రి,
మాళవగౌళ, రామక్రియ, సాయ
19 గౌళ, ద్రావిళగౌళ, కర్ణాటగౌళ,
సౌరాష్ట్రగౌళ, ౨దేసాళగౌళంబు,
భైరవి, సారంగభైరవి, నంద -
యంతి, నాదో౩త్తరి, యన్యసైంధ౪వి, వ-
సంత, మే౫ఘచ్ఛవి, సౌందరి, ౬ఠక్క
16 రాగంబుం, ౭జౌహారి, రక్కసి, సోమ-
రాగ, మసారవరాళి, ౮భల్లాత -
కాళింది, ౯ధైవతి, ఘంటారవంబు,
౧౦వ్యాళింది, దే౧౧శాళి, యభ్రపంచ౧౨మము,
గంధికామోది, శ్రీకంఠ, కాంభోజి,
సింధు౧౩వరాళి, గౌ౧౪శికి, పూర్ణ, నాట,
గుజ్జరి, సౌరాష్ట్రగుజ్జరి, ద్రవిళ-
21 గుజ్జరి, మలహారి, ౧౫గోలాహలంబు,
మాళవి, ౧౬గాళిక, మధ్య, విభిన్న,

---

౧. ధి, ౨. రే, ౩. వ, ౪. వ, ౫. ఢ, ఘ; క, ౬. ఠ, ౭. కా, ౮. వ, ౯. ధైవత, ౧౦. న్యా, ౧౧. హా; వా, ౧౨. క, ౧౩. వి, ౧౪. క, ౧౫. కోహాళంబునును, ౧౬. కౌశిక.

[౧]సాళంగనాట, భూపాళంబు, సాయ,
దోడి, సౌవీర, హిందోళంబుఁ, దురక -
తోడి, దివ్యావతి [౨]దుండక్రియ, నట -
నారాయణి, ఋషభి, నర్తకి, శుద్ధ -
[౩]హీర, కైతర[౪]కి, వ్యభిచారి, గర్మారి,
వేళా[౫]వుళియుఁ, జిత్ర వేళా[౬]వుళియును,
మాళవ, శ్రీమధుమావతి, నాఁగ
సాంగ రాగాంగ భాషాంగ క్రియాంగ -
సంగతోపాంగ సంజనిత రాగములు
మొదలి షడ్జగ్రామ ముఖ్యతద్గ్రామ -
విదిత సంభవరాగ వితతులలోన
నిల నెన్నఁబడు నూటయెనిమిది రాగ -
ములయందు స్త్రీపున్నపుంసక రాగ -
ముల షాడవౌడవంబుల విభేదములు,
నలిగొన [౭]బంబళనారాట, మిశ్ర,
[౮]కావుళ, ధ్వనిచతుష్క శ్రేష్ఠలీలఁ
గావించునారాట కావుళధ్వనులు
పూరితంబుగను శారీర చతుష్క

౧. పా, ౨. సంపె, ౩. (౦ద) ౪. నాక, ౫. క, ౬. పు.
౭. బంభర, ౮. న.

సారమా[౧]హేశ్వర శారీర మొలయ
సరి[౨]వాచకంబులు జయయు నుజ్జయయు;
సరుదగు [౩]నందును హాయి, [౪]సుహాయి,
గాణాయి, గూఢాయి, గాఢాయి, [౫]వాయి,
దేణాయి, బహుళాయి, ధృతి [౬]బడియాయి,
ఘననిబిడాయి, చౌతూయి, దితూయి,
యనఁగ నీ పండ్రెండు [౭]ననువాచకములుఁ;
బరగ షట్స్వాదు సప్తస్వాదు నాఁగ
నురుతరాష్టావళియును నవస్వాదు
సరస మాయాయి నా [౯]జయపంచకంబుఁ
బరగు దేహావళి, వటు [౧౦]మదావళియు,
నొనరు కంఠావళియును నాఁగ నిట్టు
లను జయత్రయము నింపారంగ, నంద
ఘనవిజయస్థానకంబును, వళిగ ౧౦-
యును, నంతరంబును, నుస్ఫురవట్ట
యును, [౧౧]మందరణ, వాళయును, సర్వగతయుఁ,
దనరు భంగాస్థానమును, గమ[౧౨]లీళాయి,

---

౧. పాంచాల, ౨. వాగ, ౩. సందురు, ౪. సు. ౫. వా, ౬. బతి. ౭. నీవాచ, ౮. ద్రోయాయి; మాయాలు, ౯. జయి (స), ౧౦. మదా. కె. ౧౧. మంప, ౧౨. లా.

రతి నాభిగతి, యుదరగతి, కంఠగతి
ప్రతతు లా౧తిరువులు పండ్రెండు వెల౨యు;
౩యుత దేహానాభి కక్షోదరకంఠ
౪వితతపంచస్థా౫న విహితజాతములు
౬వరిహారి ౭సక్కట ౮సరివాగ వహణి
వరకంఠికాపాళి వహణి, యున్కుట౯ము
ధర౧౦ముదువయును ౧౧సైతంబును, నాఁగ
౧౨వరుసఁ బదనకొండు వహణిభేదములు;
లలిత, గాఢయు, గాఢలలితయు, బాచ్చ-
లలితయు, నేవళయు, లవులంగితము,
గహాగు౧౩హాకము, బాచ్చగాఢ, వివరణ,
మహిమ దొక్కటియు, గమకము దొక్కటియుఁ,
గంపితంబు, వివశ, గాణాయిలంబు,
నింపు, గోష్ఠాగోష్ఠి, నుంపును, దీన-
కాకు, వెల్లావెల్లి, ౧౪కల్లి, స్వభావ-
కాకును, గొంకును, గంపితం, బణుకు,

---

౧. పరు, ౨. య, ౩. యుద, ౪. విదిత, ౫. త, ౬. సరి వో, (హో) రి; ౭. చకగాటు, ౮. పర్వా(ర్వ), గహణి, ౯. యు, ౧౦. ముదుప, ౧౧. సయి, ౧౨. పరుసన పదకొండు, ౧౩. హి, ౧౪. ఘు.

దరహారంబును, [౧]సనుతాయియు, నోజ,
సరిది, పేరాపేశి, సరి[౨]బరసంబు,
[౩]మోట్టాయితము, నాఁగ ముష్పదిరెంపు
నట్టివిశుద్ధతాయంబు లొప్పార
మొదలను[౪]నెవణ నా నదయుఁ [౫]దానంబుఁ
బొదలెడు[౬]స్ఫూర్తి నాఁ [౭]బూరణ నాఁగ
రంగు నా నదిసో[౮]మరక్తి నా జిగియు
సంగతి[౯]గముళ నాఁ జనుకంపితంబు
నాలాడ మనఁగఁ దా నా[౧౦]నైక [౧౧]మనఁగఁ
బోలం[౧౨]తిగ సమ[౧౩]ణ నాఁ బూనరు[౧౪]ఘోట్టాయి
[౧౫]వరువడి గవణ నాఁ బరగు[౧౬]నావాళ
యరుదగు[౧౭]వ్యక్తి నా [౧౮]నలిఁ బ్రబంధంబు
నలరారు క్షేత్రాంగ మది[౧౯]యలంకూళి
సెలఁగు షడక్షరి [౨౦]సెప్పనవజ్ఞ
యొదవంగ నిహతంబు నుభయకాశాన

౧. వను, ౨. బసరంబు, ౩. ముట్టాయిల (వ) ము, ౪. నెన ణానదియతానంబు, ౫. తామంపు, ౬. స్ఫూ, ౭. బూ[illegible]ము; బూరణాయదియు, ౮. స; సా, ౯. ముగళ, ౧౦. [illegible], ౧౧. మని యు; మదీయు, ౧౨. ంపు, ౧౩. న, ౧౪. గా[illegible]యి, ౧౫. స[illegible], ౧౬. వాతాళ, ౧౭. వ్య, ౧౮. నన(వి), ౧౯. యుయుహ(కా) ళి, ౨౦. చెప్పినవచ్చం(జ్ఞ).

మదియుఁ దాహుత్తర యది భజవణియుఁ
జెలువగుభజనచే సిగనిలు[1]పట్టు
లలిఁ బదియేను సాళగతాళగతులుఁ;
బ్రియమందిఁ[2]నాగావతియును, [3]నందావ -
తియు, వరభ[4]ద్రావతియు, [5]వినయావ -
తియుఁ, జరభోగావతియును, నింద్రావ -
తియు, నాఁగ నాఱును దీప్తమై మించి,
యాళ[6]తులవి నిబద్ధానిబద్ధో[7]క్తి
గాళి వైదర్భి వాంచాలిరీతులను
మానంబులగు మంద్ర మధ్యతారములఁ
[8]దానాంగ తత్త్వాంగ తనులు దుల్కాడ
దేసియు మార్గంబుఁ దీటుకొనంగ
భాసురంబుగ దశప్రాణాదు[9] లులియ
[10]లలి రసవర్ణనాలంకారభావ -
ములు మృదుమధురసముచితోక్తు లలర,
[11]మున్నట [12]హారవేషములలో[13]నఁ బేరు -
గొన్న [14]గాణలలోనఁ గుపితవేషమునఁ

---

౧. పట్టు, ౨. సౌగా, ౩. సందా, ౪. భద్ర, ౫. విస, ౬. త, ౭. తానొంద, ౮. లోలయ; లవియ, ౯. లలితసౌవర్ణ ణ, ౧౦. మున్నను, ౧౧. నావేశ; సారవేశ, ౧౨. నువేరు, ౧౩. బాణుల.

గంబళాశ్వతరాది గాణాధిపతులు
దుంబురు నారదాదులు ప్రీతిఁ బాడ,
సంగరాగంబు [౧]గీతాంగరేఖయును
రంగశోభయు ముఖరాగంబుఁ సతము
వితతంబు [౨]నిలయంబు విగతియు [౩]నంస -
గతియు నావర్తన [౪]గ్రహాగతి లవణి
[౫]దేసికారత[౬]సభా ధీరధియును గ -
[౭]ళాసంబు[౮]సాక్కి సళావళి[౯]భ్రమరి
యవధానమును సంధి[౧౦]యును నొకవిధము
వ్యవసాయమును నిజవణియు [౧౧]లంఘితముఁ
దాళ మభినయోపతాపనయును సు -
తాళంబును బ్రసన్నతయు వివర్తన[౧౨]ముఁ
బయవాటము లలిత[౧౩]వసయుఁ [౧౪]గనిష్ఠ -
కయును[౧౫]నప్పణము [౧౬]బళయును గోమళక,
యుల్లాసమును, లలియును, మనోహరము,
డిల్లాయి, [౧౭]దుతూణి, శేవణి, జంకె,

---

౧. గ, ౨. నివ, ౩. నంశ; సంశ, ౪. సంగ్రహగతి, ౫. దేశ, ౬. సుఖాదిరద (వ) యును సు (సుఖ) క, ౭. ళాసంబు, ౮. బొకి, ౯. తి, ౧౦. యనియొక, ౧౧. లగ్గి, ౧౨. ము, ౧౩. క్రియను, ౧౪. గరిష్ఠ, ౧౫. నర్పణ, ౧౬. బల, ౧౭. సుతా, (ఖా) ణిరే (దే)వయు; దుఖాయి దేవయు; తూఖణి గ్రైవయు.

[1]డాలంబు, [2]రవళి, సౌష్ఠ[3]వము, విభ్రమమును,
జాళి, యొయ్యారంబు, సరసంబు దనర
వరుసఁ జతుర్విధవక్త్రవిభ్రమముఁ
బారి సప్తవిధనిజభ్రూల[4]తాటనము
షడ్వింశతిక్రమచక్షు[5]రంకితము
షడ్విధనాసాలసత్కుంచితంబు
ఘనయుక్తి దశవిధకర్ణావధాన -
మును నవవి[6]గళముఖోల్లసనము
సురుచిర త్రివిధవక్షో విలాసంబు
ధరఁ జెప్పనొప్పు పాదద్వయపంచ -
కంబు నూరుద్వయకలితపంచకముఁ
బంబి సుగతి, సమభంగి, త్రిభంగి,
యరుదగు వింశతి యంగహారములు
ధర నిఱువదిరెండు దానకంబులును
ఛత్తీసుదృష్టుఁ జౌషష్టిహస్తములు
*బత్తీసుచారులు భ్రమరులు నేడు

౧. సోళంబు, ౨. కరగి, ౩. ద, ౪. నటన, ౫. రిం, ౬. గ.

* 'బత్తీసు' అంటే ౩౨. కాని, సం. అనువాదములో "ద్వావింశతిమితచారిభిః" అని ఉన్నది. ౨౨ కు 'బాఇస్' అని ఉండవలెను; అట్లుంటే ప్రాస చెడుతుంది. సం. అనువాదము ప్రమాదమా?

నోగిఁ గరణంబు లష్టోత్తరశతము
మొగి నూఱలంకారములు శిరోభేద-
ములు ¹పదుమూఁడును ముప్పదిరెండు
వాలుపారు ²దండనంబులు ³నొప్ప హంస-
గతియును ⁴మాతంగగతియును వృషభ-
గతియును మర్కటగతియును మేష-
గతియును మాయూరగతియును భోగి-
గతియును నాఁ బెక్కు గతులు వొల్పార
రంభ యాదిగ నప్సరస్సమూహంబుఁ
గుంభినీసతులలోఁ గూడి యాడంగ,
నాదట నుభ⁵యామరాచార్యలీల
నా⁶దధీచ్యుపమన్యు లాదిగాఁ గొలువఁ,
దక్కిన తాపసోత్తములలోఁ ⁷గలిసి
మ్రొక్కుచు భృగుముఖ్యమునులు భజింపఁ,
బ్రమథు లప్పారి వీరభక్తసంఘంబు

---

లకమేమో! ఈపాదమునకు బదులుగా ఒక ప్రతిలో "చిత్తవిక్రియలు వచింప ముప్పదియు" అని ఒక అధికపాఠ మున్నది. దీనికి సం.లో అనువాదము లేదు.

౧. పద, ౨. మం(డ; ద), ౩. నొప్ప, ౪. వాయస, ౫. యమతా, ౬. దధీచియునన్యులాదిగా; దధీచోపమన్యాదులు, ౭. దలఁచి.

రమణ నుబ్బుచు శివార్చనములు సేయ,
నాజనార్దనుఁడుఁ బయోజ[౧]సంభవుఁడుఁ
బూజారితపసులపోల్కిఁ బూజింపఁ,
బ్రభుతరంబుగఁ [౨]దానవపతులలోఁ గలిసి
యిభముఖషణ్ముఖు లిఱుదెసఁ గొలువఁ,
జండాంశుసితకరజ్వాలనతారక [౩]ల-
ఖండదీపములలోఁ గలిసి వెలుంగ,
నారంగ నంది మహాకాళవిభులు
ద్వారపాలకులలోఁ దారును గొలువఁ,
గమనీయముగ మౌక్తికచ్ఛత్రధరుల
రమణ నింద్రుండు ఛత్రముఁ బట్టి కొలువఁ,
బానరుచు బానసంబులవారిలోన
ననలుండు శాకపాకాదు లొనర్ప,
వాలారుఁ బురితలవరులలోఁ గలిసి
చాలు [౪]బళా యంచు జముఁడును గొలువఁ,
బరిచర్య లొనరించు [౫]పడిహారు[౬]లట్లు
గరమర్థి బడిపనుల్ నిబ్బ్యూతి[౭]యుఁ జేయ,
సమ్మార్జనము సేయు జనులలో వరుణుఁ

---

౧. నాభుండు; గర్భుండు, ౨. దాస, ౩. లు, గండ, ౪ చాలా, ౫. ఘణి, ౬. నట్లు, ౭. సేయంగ.

డిమ్ముల సమ్మార్జనమ్ము సేయంగఁ,
గసవులు దుడుచుఁ గింకరులలోఁ గలిసి
శ్వసనుండు నటమున్న కసవులు నూఁక,
భువిని ముగ్గులు వెట్టుపుణ్యులలోన
నవరత్నముల ముగ్గు నరవాహుఁ డిడఁగఁ,
దవిలి తాండవ మాడుతపసు[౧]లలోనఁ
దవిలి యీశానుండుఁ దాండవం[౨] బాడ,
బాణాసురాది శుంభద్దైత్య వితతి
క్షోణీశ్వరులలోనఁ గూడి భజింపఁ,
బండితసత్కవిప్రవరులఁ గలిసి
చండకీర్త్యాదులు సంస్తుతుల్ సేయ,
[3]నరయఁ దక్షిణ దానవామరముఖ్య -
గరుడ గంధర్వ కిన్నర సాధ్య సిద్ధ -
వరగణావళి [౪]దొంటి [౫]వరుసలవారి
[౬]వరుసనఁ బనిసేయ బానసంబునకు
సురగిరిముఖ్యభా సురత[౭]రగిరులు
[౮]పురవరగిరి[౯]శృంగముల క్రియఁ గొలువ,
సురతరుముఖ్యభా సురత[౧౦]ర తరులుఁ

౧. మాడ, ౨. తీసేయ, 3. అరుదందనా, ౪. నొంటి, ౫. వరసల, ౬. వరుసల(న), ౭. గిరితతులు, ౮. పురి, ౯. సంఘ, ౧౦. వర.

పురితరువరచయంబులలోనఁ గొలువ,
సురధేనుముఖ్యభాసురధేనుతతులుఁ
బురిధేనువులలోన [1]బెరసి కొల్వంగ,
సురమణిముఖ్యభాసురమణితతులుఁ
బురమణితోరణంబులలోనఁ గొలువ,
ఖ్యాతి భాగీరథీ గంగాదినదులుఁ
పాతాళగంగాను[2] బంధమై కొలువ,
నేడువార్ధులలోని యేడుద్వీపములు
వేడుకఁ బురివీథివీథులఁ గొలువ,
నాకాంక్ష ముప్పదియాఱుదత్త్వములుఁ
ప్రాకారహర్మ్యరూపంబులై కొలువ,
ముల్లోకముల[3]నాథు మల్లికార్జునుని
ముల్లోకములలో సమున్నతికెక్క-
సచరాచరములు శ్రీశైలంబుమీఁది
సచరాచరాదుల చాడ్పునఁ గొలువ,
సుస్థి[4]తి మల్లికార్జునదేవదేవు
నాస్థాన మిట్లు[5]సెన్నారంగఁ బరుస
సంతసంబున ను[6]ఘే జయజయ యనఁగ
నంత సూర్యోదయం బయ్యె నెట్లనిన,-

౧. పొరిఁబొరిఁగొలువ, ౨. బద్ధ, ౩. నాడు(దు), ౪. త,
౫. బెంపా, ౬. క్షే.

## సూర్యోదయ వర్ణనము

మందరకందరసుందరనియ[1]త-
సుందరుం డగు సుకేశుని నసహ్యామునఁ
నొప్పమిసేసిన [2]తప్పన కలిగి
మెప్పొడి యిది యంచు నప్పురవైరి
నిప్పులు గన్నుల నుప్పతిల్లంగఁ
దప్పక చూచిన నప్పుడు [3]ధరణిఁ
దాళఫలములు వాతూలచేఁ బడిన
చాళి దొప్పన పడి జలజమిత్రుండు
వడిడొల్లి [4]డొల్లి శ్రీ వారణాసికిని
గడుఁ జిత్రమని నదుల్ గమిగట్టి చూడ
నప్పుడ పోయి యుద్యద్భక్తియుక్తిఁ
దప్పక శివునాజ్ఞఁ దలమోచి యచట
నవ్యయు నభవు బాలార్కేశనామ-
దివ్యలింగంబుఁ బ్రతిష్ఠఁ గావించి
చిరతపోనిష్ఠ భజించి మెప్పించి
[5]హరునిచేఁ దొంటిసూర్యత్వంబుఁ బడసి
భాతిగాఁ దొల్లింటిపగిదిన భానుఁ
డేతెంచి యుదయాద్రి నెక్కినమాడ్కి-

౧. తి, ౨. నొడలికిన 3. తరణి, ౪. తొల్లి, ౫. హరుచేత.

నంత సూర్యోదయం బగుడును బరుస
యెంతయుఁ బ్రీతితో నిట్లహర్నిశము
నవిర[1]ళమతి మల్లికార్జునుమ్రోల
శివరాత్రిపర్వంబు సెల్లుటఁజేసి
భావింపఁ దమతమభవరాత్రు లెల్ల
వేవిన క్రియఁ బ్రాగ్ధ[2]వేవె లెండనుచుఁ
బాతాళగం గాడఁ బాఱెడువారు
బ్రాతిగా శిఖ[3]రేశ్వరం బేఁగువారుఁ
బారణ సేయ నొప్పఁగఁ బోవువారు
నూరక తమతమ యూళ్లేఁగువారుఁ
దలఁపుల శ్రీపర్వతప్రదక్షిణము
నెలమి[4]సంకల్పించి యేఁగెడువారు
వఱలువసంతోత్సవము [5]నొయ్యఁ జూచి
మఱికాని పో మని మసలెడువారుఁ
దప్పక పంచరాత్రం బున్కి సాలు
నొప్ప శ్రీగిరి [6]నంచు నుండెడువారు
దండివిరక్తిమైఁ దత్పురంబునను
నుండెడువారునై యుండంగ నంతఁ

౧. తి, ౨. వేగ, ౩. రేఃభజియించువారు, ౪. కల్పించుక,
౫. నేర్పు, ౬. కంచు.

బండితదోనయ్య పంచరాత్రంబు
లుండంగఁ దలఁచి సూర్యోదయవేళ
నలిఁ దీఁటుకొన మల్లినాథుసహస్ర
కలశాభిషిక్తునిగాఁ జేసి మఱియుఁ
దడయక పంచామృతస్నపనంబు
నెడ[1]నెడ ధారగా నెత్తి మ్రొక్కుచును
క్రమమున నుష్ణోదకముల [2]గంధోద -
కములను మఱి జలకంబు గావించి,
సంధి[3]ల్లఁ దడియొత్తు శంభున కిచ్చి
బంధురాంబరమహాభరణముల్ పూన్చి
ఖ్యాపితభక్తి నక్షత గంధ పుష్ప -
ధూపదీపాదు లుత్సుకత నొనర్చి
యంచితప్రీతి మహానివేద్యముగఁ
బంచభక్ష్యాదు లేర్పడ సమర్పించి *
శిష్ట సద్భక్తరాజికి[4]గండు[5]మీఱ
నిష్టాన్నపానాదు లెలమి[6]సంధించి

౧. ధూపదీపాదులెత్తి, ౨. గంగోద, ౩. ల్లితడి, ౪. గూఢ; ప్రేమ, ౫. నట్లు, ౬. నర్పించి.

* ఈ పాదముతరువాత "మంచిగంగులపాలు మరలనర్పించి" అని ఒక ప్రతిలో అధికపాఠ మున్నది. దీనికి సంస్కృతానువాదము లేదు.

## పర్వత ప్రకరణము.

కర్పూరసహితంబుగా విడియంబు
లర్పించి [1]నవ్య పుష్పాంజలు లిచ్చి
వరుస వేవేమాళ్లు వలగొనివచ్చి
హరుఁ బెక్కుభంగుల నభినుతింపుచును

దోనమరాజయ్యకు మల్లికార్జునుఁడు ప్రత్యక్షమగుట

గనుమూయునంతన కలయునుబోలెఁ
దన చేయు భక్తితత్పరతకు మెచ్చి
మదనసంహరుఁడు శ్రీ మల్లికార్జునుఁడు
వొదలుచు వృద్ధతపోధనులీల
యరుగుదేరఁగ శరణార్థి సేయుచును
గురుమూర్తి దనయొద్దఁ గూర్చున్నఁ జూచి,
"యెటనుండి[3]వచ్చితి రేయూరు మీర
లిట యేఁగుదెంచి[4]తి రెంతగాలంబు"
నావుడుఁ దపసి "దోనయ[5]గారె మీరు
శైవలోకమున[6]కాచార్యుండు పండి-
తారాధ్యవిభుఁడు [7]లెస్సైయున్నవాఁడె
వారును మేముఁ బూర్వస్నేహితులము
నా పండితుండు [8]మేలై కూర్చు మాకు

---

౧. సవ్య, ౨. ంగల, ౩. వచ్చెద, ౪. మరెంత, ౫. గారు మీరె, ౬. నా, ౭. మేలై, ౮. లెస్సై.

మాపేరు సర్వజ్ఞమల్లికార్జునుఁడు
ననయంబు [1]సిరిగిరియందటు గూడ
వనముల గిరుల[2]దుర్వార కాంతార -
ఘన[3]బిలాంతరమహా గహ్వరంబులను
నునికి యీ శివరాత్రి యొప్పఁ జూడంగ
నరుగుదెంచినవార" మనుడు దోనయ్య
కరపద్మములు మోడ్చి "ఘనుఁడ! సర్వజ్ఞ!
చూచిన మునువిన్న చోద్యముల్ గలుగు -
నా చెప్పఁ జూడ శ్రీ నగమున" ననుడు
రమ్మని దోనమరాజుఁ దోడ్కొనుచుఁ
గ్రమ్మర బిల్వవనమ్ము[4]మధ్యమున
సరసత నందొక్క శైలశృంగమున
విరచింపఁజను దీపవృక్ష మెక్కించి
శిరమునఁ జేయిడి శ్రీగిరిఁ [5]జూడ
*కరతలామలకమై కానవచ్చుచును

---

౧. శ్రీ, ౨. దద్వార, ౩. గుహాం, ౪. మధ్య, ౫. గూడ.
* "హస్తస్థబిల్వవత్" అని సంస్కృతానువాదము.

(ఈ పాఠమువల్ల అఖండయతి తొలగిపోతుందిగాని, 'చూడ' అనేపదము రెండుసార్లు నిరర్థకముగా వస్తుంది. ఒక 'చూడ'ను పరిహరించడానికి పాఠాంతరము చిక్కలేదు. అఖండయతి సోమనాథుని కిష్టమైనట్లు ఇతరస్థలములలో కూడా ప్రయోగము లున్నవి.)

నద్భుతాక్రాంతాత్ముఁ డగుచు దోనయ్య
సద్భక్తిఁ దపసికి శరణార్థి [1]సేసి
"నెడనెడ నేఁగంగ నేఁటికిఁ జూడఁ
బడసితిఁ [2]బర్వతం బంతయు నేఁడు"
ననుడుఁ దపోధనుం "డద్దేవుపురము
ఘనతరంబగు హేమకలశముల్ గుల్లఁ
గోటలుఁ గొమ్మలు గోపురంబులును
[3]నాటకూటమ్ములు నామల్లికేశు
ప్రాసాదమును మంటపంబును క్షేత్ర-
వాసులై చనుభక్తవర్గంబుఁ జూడు,
హాటకేశ్వర మదే యందు సద్భక్తిఁ
బాటికెక్కిన వీరభక్తవర్గంబు
వీరశంకరుఁడును వీరభద్రయ్య
వీరభోగయ్యయు వీరదేవయ్య
మలహర[4]సద్భక్తి మతి గల్గినట్టి
పాలతి [5]చాకలదేవి [6]పారిఁ బ్రభాతయ్య
మఱియు వీ రాదిగా మహితసద్భక్తి
నెఱిఁ బ్రతిష్ఠించిన నిష్ఠులఁ జూడు,

౧. యగుచు, ౨. జూడ శ్రీపర్వతం బెల్ల. ౩. మాటకూటంబులు మల్లికార్జునుని. ౪. రు, ౫. పాడ్డల, ౬. భోగదేవయ్య.

శిఖరేశ్వరముఁ జూడు శ్రీనగేంద్రంబు
శిఖరంబునను ముక్తిశిఖరమై వెలుఁగు
నిష్టకామేశ్వర మిల్లిదే చూడుము,
మష్టసిద్ధులకు నిజావాస మిదియు
నేడుదినంబు లయ్యాశు భజింప
వేడుకఁ గామ్యార్థవిభవంబు లొసగు

కర్మహారి మహిమ

నిదె చూడు కర్మహారేశ్వరం బనఁగ
మదనాంత[౧]కుండ తన్మహిమ యెఱుంగు
నచ్చారుశృంగంబునం దొక్క పాము
చచ్చితద్దేహంబు వ్రచ్చియున్నెడను
నతిముఖి నొకగ్రద్ద [౨]యుఁ[౩]పాముశవము
గఱచికొంచు[౪]ను తీవ్రగతి మీఁది కెగయ
వాతోపహతి నందు నడి రెండు వ్రువ్వ
లేతెంచి కర్మహారేశ్వరంబందు
నడి జలంబులలోనఁ బ్రాణముల్ [౫]విడిచి
పుడమి బ్రాహ్మణవంశమునఁ బ్రభవించి
యాపుణ్యఫలమున నతివయుఁ బతియు

---

౧. కంఠంతమహిము; గండు నన్మహిము, ౨. య, ౩. పాప శ(స)బము, ౪. సుతీవ్ర, ౫. విడువ.

నై పూర్వా[1]జన్మంబు ననిలోపహతిని
గర్మహారేశ్వరోద్గతసరసీవి -
నిర్మలవారి మునింగి చచ్చుటయుఁ
బ్రవిమలతత్పుణ్యపటుఫలప్రాప్తి
భువి బల్లహునివంశమునఁ[2]బుట్టుటయును
జాతిస్మరత్వానుసంధిగాఁ జేసి
యీ తెఱం గంతయు [3]నిద్దఱు నెఱుఁగి
వేగంబ సకలనియోగంబుఁ గొలువ
శ్రీగిరి కేతెంచి చెలువయుఁ దాను
బల్లహుఁ డత్యంతభక్తిసంయుక్తి
మల్లికార్జును మహామహుని దర్శించి
భాసురదివ్యప్రభా[4]భాసురముగఁ
బ్రాసాదమును మండపంబు బానసము
మఠముఁ దదంతికమఠము గా నొక్క-
మఠముఁ[5]గల్పించి యీ మఠము నిండంగ
మరకతమౌక్తికమణిపుష్యరాగ -
వరవజ్ర విద్రుమ వైడూర్యముఖ్య-
భూరిరత్నావళుల్ ప్రోఁకలు వోసి

౧. జని యంత, ౨. ప్రభవించి, ౩. నిరువురు, ౪. భాసితముగ, ౫. గట్టించి.

చారుషోడశవర్ణసంపూర్ణ మైన
ప్రతిలేని తనయింట బండరుధనము
శతసహస్రార్బుదసంఖ్యను నిలిపి
వివిధా[౧]భరణములు వివి[౨]ధాంబరములు
వివిధవస్తువులును వివిధమాల్యములుఁ
గనకచామరములుఁ గనకకుంభములుఁ
దనరారు నా సుగంధద్రవ్యములును
స్వర్ణోపకరణముల్ స్వర్ణపుష్పములు
స్వర్ణభాండమ్ములు సకలవాద్యములుఁ
గనక[౩]చామరమౌక్తికచ్ఛత్రవితతు
లును సర్వసంపదలును నివేదించి
యతిశయకరితురగాందోళరథవి-
తతులు గోమహిషీప్రతతులు నొప్పించి
మంత్రులు విబుధు లమాత్యులు నీశు
మంత్రులు విబుధు లమాత్యులు గాఁగ
భృత్యులుఁగరణముల్ [౪]ప్రెగ్గడలు నీశు-
భృత్యులుఁగరణముల్ [౫]ప్రెగ్గడలు గాఁగ
బండరు[౬]గొట్టరు బానిస లీశు
బండరు[౬]గొట్టరు బాని[౭]సల్గాఁగఁ

౧. ంబరంబులు, ౨. ధవస్తువులు, ౩. ధ్వజములు ముక్తావితానంబు, ౪. ప్రెగ్గడ లీశ, ౫. ప్రెగ్గడల్, ౬. గోత్తరు, ౭. సెల్.

పర్వత ప్రకరణము

గలవర్లు లెంకల్ ప్రధానులు సీశు-
గలవర్లు లెంకల్ ప్రధానులు గాఁగ
హితులు నాప్తులుఁ బురోహితులును సీశు-
హితులు నాప్తులుఁ బురోహితులును గాఁగ
గాయకుల్ నర్తకుల్ గవివరు లీశు-
గాయకుల్ నర్తకుల్ గవివరు ల్గాఁగఁ
బండితుల్ దార్కికుల్ వాఠకు లీశు-
పండితుల్ దార్కికుల్ వాఠకు ల్గాఁగ
దాసులు బంట్లు విలాసిను లీశు-
దాసులు బంట్లు విలాసినుల్ గాఁగ
దండనాయకులును [1]దంత్రులు సీశు-
దండనాయకులును [2]దంత్రులుఁ గాఁగఁ
బౌరాణికులు శివపౌరాణికులుగ
ద్వారపాలురు శివద్వారపాలురుగ
ఘనకీర్తి వెండియుఁ గలుగు బాహాత్త -
రిని యోగమును నతిప్రీతి నర్పించి
ఘనభక్తు లక్కజం బని యున్న వేయు
నన నేల తాను నతివయుఁ దక్క
నటు కూడఁ [3]దన దేశ మంతయు నపుడ

౧. తంత్రంబులే(ని), ౨. తంత్రంబు, 3. గాదేశ.

పటుభక్తి నీశ్వరార్పణము గావించి
తరుణి నీక్షింపఁ [1]దత్సతియును నట్లు
[2]యరసి మఠంబున [3]నొక్క మఠము
వెండి కట్టించి యవ్విభు[4]సకుఁ దనదు
బండరు నఖిలసంపద్వస్తుసమితి
యఖిలరత్నావళు లఖిలాంబరములు
నఖిలాభరణములు నందు వెట్టించి
ముక్కంటి శరణంచు ముగుదయుఁ దాను
నొక్కచీరయుఁ [5]గట్టి యొగి బల్లహుండు
"ఘోర దుర్వార సంసార వారాశి
పార[6]మొందింపు మో [7]పర్వతనాథ !
పాయనిదుష్కర్మ[8]పాశబంధములు
గోయవే దేవ (శ్రీ) కుధరాధి[9]వాస !
యెల్లగాలము నిట్టు లిరువు[10]రపనులు[11]
సెల్లించుకొనవయ్య! [12]సిరిగిరినాథ !
[13]వఱలింగ[14]వీరు నా వా[15]రని[16]మన్ను

౧. నత్తరుణియు నట్లు, ౨. యరుసు, ౩. నం దొక్క, ౪. నట్టి. ౫. గట్టనొగి, ౬. మేధింపవే, ౭. పార్వతీ, ౮. పాప, ౯. నాథ, ౧౦. రు, ౧౧. ల, ౧౨. (శ్రీ), ౧౩. మరువకు మిమ్ము నాకు దెలిసిన మన్ను, ౧౪. వీరు, ౧౫. వ, ౧౬. నన్ను.

మఱవకుమయ్య శ్రీ మల్లినాథయ్య!
యిల వేయు నెన్నంగ నేల నాయిచ్చు
నలుపు మోజియ్య! శ్రీ శైలవల్లభుఁడ !"
యనుచు దేవియుఁ దాను [1]సాష్టాంగ మెరఁగి
చనుదెంచి యెక్కినచౌదంతితోన
యెఱపక కర్మహారేశ్వరంబందు
బడియు గౌరీశుగర్భము [2]నందు సొచ్చి,
బల్లహుండు శివుని భజియించునపుడు
సల్లలితాంగియు శంభుని దలఁచు
[3]భవు భర్గు నీశుని బార్వతీపతిని
శివు నభిషేకంబు సేసినయన్ని
పాలీహ్రదంబులోపల నూట వెడలఁ
బాలూట్ల యన భువిఁ బరగెఁ దా మఱియు
బడి కామితార్థముల్ వడసినవార
లడర ననంతంబు లట్లును గాక
యమ్మూఁడుశృంగంబులందును భూరు-
హమ్ములు మూఁడున్న వవి యవె చూడు,
నరుఁ డెవ్వఁడే దర్శనం బాచరింప[4]

---

౧. న, ౨. ందచొ, ౩. భవహరుండైన శ్రీ పార్వతీరమణు,
౪. చు.

నదిదియాకారత్రయంబు సిద్ధించు,
నొకచెట్టుమొదల నం దొకచెట్టునడుమ
నొకచెట్టు తుదియు నుద్వ్యక్తి ముట్టినను
ధర స్వర్గమర్త్య పాతాళలోకముల
చరితంబు లెల్ల నిశ్చయము గాన్పించు,
నొకచెట్టుమూలంబు నొకచెట్టుపత్ర
మొకచెట్టుపుష్పంబు నొగి ధరియింప
హాఢి[1] బ్రహ్మోపేంద్ర రుద్రులు[2]మెర్వాల
వేడుక నెప్పొద్దు విహరింపుచుండు,
నొకచెట్టుకాయయు నొకచెట్టుపండు
నొకచెట్టుబీజంబు నొక్కట నమలఁ
దివుట నుత్పత్తి స్థితి లయముల్ దక్క
శివపురంబున నుండు శివగణాలీలఁ
గామించి యెవ్వఁడేఁ గాలత్రయంబు
నామూఁడుదరువుల నాహార ముడిగి
నలి మూఁడు నేసిదినము లాగమోక్త
కలితోపచారసంగతి భజియింప
సారూప్యసామీప్య సాలోక్యమహిమ
లారంగ సిద్ధించు నదె [3]శివమహిమ

---

౧. బ్రహ్మవిష్ణు, ౨. లోన, ౩. వాని.

దా నెట్లు గాన్పించెఁ దరువు లంతేని
మానక పాలూ[1]ట్ల మల్లి కార్జునుని
నిత్యంబుఁ బాలను నేతఁ బెరుగ్వనను
ప్రత్యేక మవి[2]యు ముప్పందును నందు
సెలువార జలకంబు సేసి, సహస్ర
కలశాభిషేకంబుఁ గావించి[3], గోఁగుఁ
బూవులుఁ దామరపూవులుఁ గలువ-
పూవులు వేయేసి పూవులు, గుగ్గు-
లమును మూఁడేసి[4]పలంబు లర్పించి
ప్ర[5]మితి వేయేసి హారతు లర్ధి నెత్తి
పాయసంబులుఁ బంచభక్ష్యముల్ పద్ర-
సాయతాన్నములు సమర్పణ సేసి
యాసక్తిమూలపంచాక్షరి మూఁడు
సేసి [6]వేలుజపంబు సేయంగమూఁడు
దినముల కీశుండు దివ్యదృష్టియును
ఘనతరజ్ఞానంబుఁ గరుణించునపుడు
గానంగవచ్చు వృక్షత్రయం బందు
దా ననేకములు సోద్యములు వెండియును

---

౧. ట, ౨. య, ౩. కొంగు, ౪. ఫ, ౫. మ, ౬. జపంబులు.

ననుపమబిల్వవనాంతరం [1]బిదియు
విను పంచయోజనవిస్తీర్ణమందు
ప్రేలెంట నొక్కొక్క వృక్షంబు గలదు
గ్రాలు దివ్యౌషధాకారంబు లవియు,
నల్లెంట నొక్కొక్క నవలత గలదు
నెల్లసాధక[2]జనసేవ్యంబు లవియుఁ,
జుట్టెంట నొక్కొక్క చోద్యంబు గలదు
నెట్టన్న వారికి నెఱుఁగంగ రాదు,
జేనెంట [3]కొక్కొక్క శివమూర్తి గలదు
దా నభిమతఫలదత్తంబు లవియు,
మూరెంట నొక్కొక్క మునిపల్లె గలదు
భూరిశ్రుతిస్మృతి స్ఫురితంబు లవియు,
జేతెంట [4]కొక్కొక్క సెలయేఱు గలదు
ఖ్యాతదివ్యాంగనాకలితంబు లవియు,
బారెంట నొక్కొక్క పర్వత ముండు
నారూఢి దివ్యరత్నాంగంబు లవియుఁ,
గూఁగెంట నొక్కొక్క కూటంబు గలదు
యోగీంద్రసిద్ధనియుక్తంబు లవియు,
నంతంత నొక్కొక్క హర్మ్యంబు గలదు

౧. బ, ౨. ఘన, ౩,౪. నొక్కొక్క.

సంతతప్రమథప్రచారంబు లవియుఁ,
బాటెంట నొక్కొక్క భవనంబు గలదు
మేటివిరక్తుల కూటంబు లవియు,
నామట నొక్కొక్క [1]యధ్వంబు గలదు
గామితలోకసంకలితంబు లవియు,
నదియునుగాక ఛాయా[2]చ్ఛత్ర మనఁగ
మొద[3]లు మ్రాఁకున లేదు, [4]మొగులును లేదు[5]
నదపడి యా పీఠపై బాటసరుల
కొదవంగఁ గలవు నిష్టోపభోగములుఁ,
దరు లిదే చూడు మిత్తఱి పీఠ లేదు
ధర నదృశ్యకరణి దానిమూలంబు
మోహినీగజ మదె ముంద[6]ఱి వెస స-
మాహితపృథులశి[7]లాకారగజము,
సాధకుఁ డెవ్వఁడే సాధించి యెక్కఁ
గ్రోధిల్లుఁ జను నెట్టుకొను ఘూంళి సేయుఁ
గుప్పించు నుఱుకుమై నొప్పించు ననువుఁ
దప్పింపఁ దల వంచు నుప్పరం బెగయుఁ
బ్రల్లన యల్లంతఁ బడుఁ జిఱ్ఱదిరుగు

౧. మాద్య, ౨. వృక్ష, ౩. లు సుదయును; లమ్రాకుల, ౪. మొసడును; మొదలును; మోసలును, ౫. డు, ౬. టి. ౭. వా.

నల్లార్చు ఘిల్లుఘిల్లను[1]బాలుంబాలు,
నిట్టు విజృంభించి యిట యట వడంగ
బిట్టోడి [2]యియలుంగక బెగడక చనక
[3]తలంగక [4]తలరక తల్లడపడక
[5]యలుగక లెక్కసేయక డిల్లపడక
వ్రాలక కొంకక వడంకకయున్నఁ
గ్రాలుచు మోహినీగజ మంత మెచ్చి
సర్వసిద్ధులు నిచ్చు సాధకులకును,
గుర్వీగా మఱియెల్ల గూధరంబు లీవు
నీవనమధ్య మహీధరాగ్రమున
భావించి చూడు బిల్వావనీరుహాము
నామహీజముక్రింద నదె బిల్వవన శి-
రోమణి బిల్వేశ్వరుని శివాలయము
సాధకుం డద్దేవు సప్తరాత్రము ల-
బాధితనిష్ఠమైఁ బాయక కొలిచి
భవుదీపతైలసం[6]భావితాంజనముఁ
దివిరి తాల్పంగ దివ్యదృష్టి వొల్పారుఁ
గామారినగరోపకంఠదేశమునఁ

౧. బాదుతాడు; తారుదారు, ౨. యలకక; యులు, (డు)కక, ౩. తర్గగగ, ౪. తలకక; తరలక, ౫. యెగు, ౬. ల్వ, ౭. పొడి.

పర్వత ప్రకరణము

దామఱి యొక్క దద్దడ[1]ముందు నందు-
లో నొక్క క్షేత్రపాలుని[2]స్వరూపంబు
గానంగ మఱిదానిలోన భైరవుండు
నెడ నెడ సాధకుం డేతేరం దాను
గుడియుం బెర్గుచు నుప క్రోధోత్కటాగ్ని
ముక్కునం బొగలు సముద్ధతి వెడల
నెక్కొన్న మొగమున నిప్పులు రాలం
గర ముబ్బి మంటలుం గన్నుల గ్రమ్మం
దెరలుచు దేహంబుం దెకతెక నుడుక
మూవలగంటల మ్రోంత నొక్కట ది-
శావలి యద్రువం జా[3]చా యని చప్ప-
రించుచు నొరలుచు రేంగుచుం [4]దత్త-
రించుచు రాకురా కంచును గహాక-
హాట్టహాసధ్వను లద్రులం జెలంగం
గట్టురువడి భీతి [5]వుట్టింపనిలువ
కా భైరవుని భీకరాకారమునకుం
దా భయంపడక సాధకుండు నవ్వుచును
నుబ్బుచు నార్చుచు [6]నురువడించుచును

1. మున(ను)నందు, 2. శరీరంబు, 3. ఝాంఝా, 4. దప్ప, 5. పు, 6. నుర.

బొబ్బలు వోడుచుచుఁ బొంగుచు మాటు
గబ్బ[1]రించుచుఁ గలఁగకు గగ్గ కనుచు
నిబ్బరం బొడుచు నిక్కుచు [2]సంత
గ్రబ్బేల యనుచును [3]గచ్చించుకొనుచు
నబ్బితి నాకంచు నట ని[4]ల్వు మనుచుఁ
బఱతెంచి యెగసి యా ప్రతిమశిరంబు
వెఱ పింతయును లేక విఱుఁగఁ దన్నుడును
ధర మిట్టిపడి యంత శిరము నవ్వుచును
బిరుదులబిరు దన పృథు[5]శౌర్యమునకు
సత్త్వంబునకు సాహసమునకు నిర్భ -
యత్వంబునకు నుదారత్వంబునకును
మెచ్చితిఁ దల[6]కీలు వృచ్చితి మార్గ
మిచ్చితి బిల మిష్ట[7] సొచ్చితి [8]గాన
యిక్కడ నన్ను జయించినపిదప
నెక్కడి దెక్కడి యెదు రింక నీకు
వారక నాగళద్వారంబ బిలము
ద్వారంబుఁ జొఱుచొఱు దడయకయుండు
నల్లన బిలములోఁ [9]తరసెద ననక

---

౧. లిం, ౨. నిం, ౩. కచ్చించు, ౪. లు, ౫. కా, ౬. కిలు, ౭. ష్టచో, ౮. గాక, ౯. న.

యెల్లిన ధరఁ జేతు లూ[౧]నెద[౨]నక
మెల్లిన తా[౩]పలు మెట్టెద[౪]నక
ప్రల్లిన [౫]యురుక కపాయ పూ సనక
తల[౬]లేని భైరవు దండిరుండంబు
గళగహ్వారం బాదిగా లోఁతు నూఱు
మగనిల్వవెడలుపు మఱి తత్సమాన
మగుబిలముఖమునం దఱిముఱి నుఱికి
యంత దక్షిణముఖంబై యేఁగనేఁగ
నంతకంతకుఁ జాల నన్నువమైన
బిలమున కడ్డంబు వెట్టినయట్టి
తలుపుభావమున నంతకు మున్న వచ్చి
కుపితవేషంబునఁ గుటిలభైరవుఁడు
దపసియైయున్న సాధకుని వీక్షించి
యిటనుండి పోదపోద [౭]యిట్లు గాదేని
యిటయొండె రమ్ము దెవ్వమ్ము లెమ్మనుడు
'నేల[౮]రా [౯]కొడుక నీ కింత దల్లడము
సాలిమిఁ జూడు నీ సాధకత్వంబు
నిటుగాని నీబిరు దెఱుఁగంగ [౧౦]రాదె

---

౧. డె, ౨. మ, ౩. వు, ౪. మ, ౫. నులుక, ౬. లని, ౭. మట్లురాలేని; యెట్లుపోలేని, ౮. యా, ౯. కొడక, ౧౦. రాదొ.

కటకటా! శరణార్థి గఱవె జిహ్వాకును
గరములు వంగవే శిరము[2] చక్కటికిఁ
బరమదారిద్ర్యమే భక్తి సీమ[3] తికిఁ
దపసుల మేము పెద్దలము వెక్కఁడు
లుపవాసము[4]లు వాయ కున్నార మిచట
మము లేబరము సేసి మఱిపోయి పడయు
నమరత్వ మైన నీ కది మంచియదియె
యింతన పడసి[5]తే యిష్టార్థసిద్ధి
యంతరం బెఱుఁగ[6]వె యది యేల వేయుఁ
జెప్పెద నామాటఁ జెవియొగ్గి వినుము
నిప్పటియట్లకా దిటమీఁద మనసు
నదె పులిముందఱ నడ్డమున్నది[7]యు
యిదె నూఱుమగనిల్వ లీయున్న బిలము
మున్న వెనుకఁ[8]గొట్టు ముందఱ నూయి
నున్నచందమునఁ గార్యం బున్నయదియు
దిగనుర్కవచ్చుఁబో డిగ్గుడు గాన
యెగయ నూర్చ్మగనిల్వ[9]లె శ్లైక్కబిలము
దరులు ముందఱ లేవు దాపలు లేవు

---

౧. కరువె, ౨. చంగ, ౩. ది, ౪. లఁబా, ౫. తో, ౬. వ, ౭. యొ; యొ, ౮. ద(గఁగు)రు, ౯. ట్లగు; ట్లున్న.

## ప ర్వ త ప్ర క ర ణ ము

నరయ లోఁ తెంత దా నంత వెడల్పు
పోరాదు వెన్కకుఁ బోక ముంద[1]ఱికిఁ
బోరాదు బిలములఁ బోయెద మనినఁ
బూని నీ వీప్రొద్దు పూజించులింగ
మీని[2]వి యీబిలం బీనోపునయ్య
పృథివి సద్భక్తు లేబిలములు సొచ్చి
ప్రథితదృష్టాదృష్టఫలసిద్ధిఁ గనిరి
పర్వత[3]కల్పంబుఁబట్టియే యింక
గర్వించి తలక్రిందుగాఁ బడియెదవు
గుడిచె[4]డు కట్టె[4]డు కొమరుఁబ్రాయమునఁ
గొడుక[5]యిచ్చట నేమి గుడువ వచ్చితివి
సలమున వచ్చితి సావన[6]కాక
యిల నిష్టసిద్ధుల [7]కిదియె శ్రీగిరికి
బిలము సతుర్ద్వార బిలమును వృషభ-
బిలమును ఖేచరబిలమును బాప
బిలము నాదిగ గిరిఁ బేర్కొన్న బిలము
లెలమి నిర్వది[8]వేలు నేణ్ణూఱు[9]గోట్లు
భుక్తిప్రదస్థానములు నూఱుగోట్లు

---

౧. టి, ౨. డి. ౩. త, ౪. డి, ౫. య, ౬. గగాంక, ౭. ని, ౮. కోట్లు, ౯. నందు.

ముక్తిప్రదస్థానములు [1]వేయుఁగోట్లు
నలరి యేకైకకార్యప్రదస్థాన -
ము లనంతకోటులు గల వందులోన
విను కొన్ని బిలములు విస్తరించెదను
జనువాఁడ వెట్లును జనియెదుగాక
యనవుడు [2]మూర్ఖత నరుగంగ నేల
ననుచు నాకర్ణింప నభిముఖుం డగుచుఁ
దపసి సెప్పఁదొడంగెఁ దా నొక్కనాఁడు
విపినాంతరంబున విహరింప నంత
నొలసి తదీయవనోపకంఠమునఁ
బొలుపారుకొలనిలో బుగ్గన పొడిచి
దివ్యాంగదీధితుల్ దివ్యాంబరములు
దివ్యాభరణములు దివ్యచిహ్నములు
నుల్లసితంబుగా నురమున నొ[3]ప్ప
మల్లెపూవుల పెక్కుమాలిక లమర
మసలక పసిఁడిదామర లిఱుగేల
నసలార నిడి మల్లికార్జునదేవు
పురముది క్కేఁగ నేఁ బోయి, యాయయ్య
చరణాబ్జముల[4]మీఁదఁ జాఁగిలి మ్రొక్కి

౧. నూఱు, ౨. మూర్ఖుపన; మూర్ఖునైయ, 3. ప్పా, ౪. మోప.

## పర్వత ప్రకరణము

[1]వరవనాంతరసరోవరమధ్యమమునఁ
గర ముద్భ[2]ంచినకారణం బేమి?
నరుఁడవో నీవు గిన్నరుఁడవో భక్తి-
పరుఁడవో ప్రచ్ఛన్నహరుఁడవో ప్రమథ-
వరుఁడవో పాతాళచరుఁడవో యమృత-
కరుఁడవో తరుణభాస్కరుఁడవో తొంటి-
మరుఁడవో దానవేశ్వరుఁడవో వజ్ర-
ధరుఁడవో యొక్క నిర్జరుఁడవో చెపుమ,
యేలోకముననుండి యేఁగుదెంచితివి
యేలోకమున కింక నేఁగెద వనుఁడు
వినుము తపోమూర్తి విస్మయం [3]బొంకఁడు
వినవయ్య నాపో[4]వువిధ[5]ముఁ జెప్పెద[6]ను

### కరవీరుని కథ

గరవీరుఁ డనఁగ రాక్షసవిభుం డొక్కఁ
డరు దరు దనఁగ నీ యచలంబునందు
రతిఁ గరవీరేశ్వరం బనఁ బ్రమథ-
పతిఁ బ్రతిష్ఠించి తపం బాచరింప
హరుఁడు ప్రత్యక్షమై యడుగఁడు మనిన
వరదాని వేఁడొందు వరము నేనొల్ల

౧. పర, ౨. గు, ౩. బొంఁదు, ౪. మెట్టులనిన, ౫. ము, ౬. ద.

భువిని నీసర్వాంగములును ధాతువులు
వివిధసూక్ష్మస్థూలవృక్షరూపములు
గావించి తత్సముద్గతపుష్పవితతి
నీ వెప్పుడును బ్రియాన్వితుఁడవై తాల్పు,
మందు గించిద్దళంబైన నిన్నుఁబూన్ప -
[1]నొంద దేవేంద్రత్వ మొనగు మర్త్యులకు,
నటుగాక యీపుష్ప మంతయు నొకఁడు
వటుభక్తి మీపదా[2]బ్జములపైఁ బూన్ప
మఱి పూర్వజన్మసమాధులు లేని
నెఱిముక్తిఁ గలిగింపు, నిజ మట్లుగాక
యొకపూవు నినుబూన్ప నొరునైనఁ బనుప
[3]సకలతురంగకుంజరసహస్రములు
ధర వాజపేయశతంబు[4]ల శ్రుతుల
నరుదగుకోటికన్యామహాదాన
ములఫలంబులఁ బొంద ముక్కంటి యొసగు,
బిలిబిలివరములు ప్రియము గా వనుడు
ననమాత్ముఁ డొసగె న ట్లది యాదిగాఁగ
వసుధ నీ కరవీర[5]వన మొప్పె మఱియు

౧. నొందు, ౨. బ్జంబులఁబూన్ప ౩. సకలేశముత్తకుంజర, ౪. లు, ౫. వరముష్టినదియు.

పర్వత ప్రకరణము

నావిర్భవంబయ్యె నఖిలలోకము[1]లఁ
గావింపఁ జను బహుకరవీరజాతి
యకృతాత్ములకుఁ గాన నరిది యివ్వనము
సుకృతాత్ములకుఁ గాన సులభ మివ్వనము
వ్వాని నీప్రాక్తనపుణ్యఫలమునఁ
గానంగనయ్యె నీ కరవీరవనము,
నట్టునుగాక దివ్యాంజన[2]లతిక
మెట్టినవాఁడ [3]వీ మేదినిమీఁద
నెట్టిపుణ్యుఁడవో నీ విచ్చోట నుండఁ
గట్టెదురను మున్న గానంగఁబడియెఁ
గదలకు మీ వింకఁ గదలితివేనిఁ
[4]గదిసి చూచిన [5]మమ్ముఁ గానంగరాదు,
నది గరవీరమహాత్మ్య మీకొలని
విదితప్రభావంబు విను తపోధనుఁడ,
యరుదగు సురదీర్ఘికాంశ మీకొలను
వరగ భాగీరథిపాయ యీకొలను
నివుడు [6]భోగావతినిట్ట యీకొలను
ధ్రువము గోదావరిత్రోవ యీకొలను

౧. లు, ౨. తిలక, 3. వే, ౪. కదలి; కదిసి, ౫. మము, ౬. భోగవతిని.

వరకుండతీర్థాలవాల మీ[1]కొలను
సరి మల్లికాకుండసరణి యీకొలను
పెనుపారు జలదుని బీజ మీకొలను
ఘనకీర్తి శివపూళిగంగ యీకొలను,
యిందుల పద్మంబు లీశుఁ బూజించి
సుందరి దేవకి సుతుఁ గృష్ణుఁ బడసె,
యీతామరల శౌరి యీశానుఁ బూన్చి
ఖ్యాతిఁ జక్రంబును గన్నను బడసె,
సరసిజగర్భుఁ డీ సరసిలో నొక్క
సరసిజంబునఁగాదె సంభవంబయ్యెఁ,
గరపద్మములతోడి [2]కలువలు గౌరి
సరిఁ దాల్చు లీలాంబుజము లివి గావె?
తరణి యీపద్మమిత్రతఁజేసి కావె
స్ఫురిత తేజోవృద్ధిఁ బొదలె లోకముల?
నీపద్మములఁగాదె యింతి యా[3]గొంతి
వాపారిఁ బూజించి పడసెఁ బాండవులఁ?
జెంది యీపద్మముల్ శివుఁ బూన్చి కావె
సుందరి భృగుపత్ని శుక్రునిఁ బడసె?
నదిగాక యీ[4]విరుల్ హరుఁ బూన్చి[5]కాదె

---

౧. కోటి, ౨. కవలుగా, 3. కుంతి, ౪. పూలు, ౫. స్వర్గా.

సుదతి కౌసల్య[1]సత్సుతు రాముఁ బడసె ?
హారు నిందు భ్రమరాన్వితాబ్జంబుఁగాదె
ధరఁ బూన్చి శశి నత్రి దనయుగాఁ బడసె ?
భామలు శుభవేళఁ బాడెడునట్టి
తామరవిరులు సీ[2]తామర ల్గావె ?
వసుధఁ బుణ్యులకు సువర్ణ[3]పద్మములు,
వసుధఁ గర్ములకుఁ గేవల మంబుజములు,
ధృతిఁ బుణ్యులకు నివి దివ్యతీర్థములు,
క్షితిఁ [4]గర్ములకు నివి కేవలోదకము,
సన్నుతి నిందుల జలచరావళులు
నెన్ని చూడఁగ[5]వేఱె హేతువు[6]లవియె
హరిపేరి మత్స్యకూర్మాదు లీకొలను
చరజీవులకు మన్మసంతతి యగుట
మహి నిట్టి పసిఁడితామర[7]ల యీకొలని-
మహిమఁ జెప్పితి నింక మత్క్రియ వినుము,
పుట్టితి శాంకరీపురవరంబునను
సట్టినామము పురి కగు[9]డేమి యనిన
నోలసి బాలక్రీడ లోలి నాడంగఁ

౧. యసుతు, ౨. దామముల్, ౩. పుష్పములు, ౪. ధ, ౫. వేళ, ౬. స్నది, ౭. యాకు, ౮. ప్పెడి, ౯. షే.

దలంచి పార్వతి దోడి తరుణులం జూచి
రాజకీరాలాపరంజితవాణి
రాజకీరమ్ముల రమణి తెమ్మమ్మ
కోకిలకలనాద కోమలి నీవు
గోకిలానీకంబుం గొంచు రమ్మమ్మ
వరహంసగామిని వనితాలలామ
వరహంసనిచయంబు వరుసం దెమ్మమ్మ
బర్హిణ బర్హనిర్భర కేశభార
బర్హిణానీకంబుం బరగం దెమ్మమ్మ
[1]తరుణి పుత్త్రికల రత్నంబుపుత్త్రికలం
గర మొప్పుమణిపుత్త్రికలను ముత్తెంబు-
బొమ్మల దంతంబుబొమ్మలం బసిండి-
బొమ్మల గురుగులం [2]బోలంతి [3]తెమ్మనుచు
సురకన్యకలును హేమ[4]గిరికన్యకలును
వరరుద్రకన్యలు నురగకన్యలును
ప్రమథకన్యలు దను బలసి కొల్వంగ
హిమగిరికన్య పూర్ణేందునిభాస్య
గిరిజ మున్ శైశవక్రీడాభిరతిని
నరుగుచు నరుగుచు నర్థి దుల్కాడం

౧. తరుపుత్త్రికలను, ౨. పొసంగ, 3. దెమ్మమ్మ, ౪. కర.

## పర్వత ప్రకరణము

దివిరి భాగీరథీతీర దేశమున
భువి బొమ్మరిండ్లుగా పురముఁ గల్పించి
తన్మధ్యమున గౌరి తాన చేముట్టి
సన్నుతి నొక్క ప్రాసాద మొప్పారఁ
గావించి యొక్కలింగముఁ బ్రతిష్ఠించి
సేవా[1]రతిని దోడి [2]చెలువలుఁ దాను
శివుఁ గొల్చి మఱియు విశేషవినోద
వివిధోత్సవంబుల వేడ్కఁ జల్పుచును
గొండొకప్రొద్దుండి కోమలి యరిగె
నుం[3]డ సైకతపురం బుర్విపై నట్లు
యంత నగ్గౌరి మహాతపోనియతిఁ
గంతుమర్దనుఁ బతిగాఁ బ్రీతిఁ బడసి
హరుఁడును దాను నన్యోన్యానురక్తి
సరి నవినాభావసంబంధ మమర
నానందలీల నోలాడుచు నంతఁ
దా నప్పురం బద్రితనయఁ దలంపఁ
దలఁచినతలఁపుఁ దత్పతి యెర్గి నీవు
దలఁచిన యొకసికతాపురం బదియు
నిక్కంబు పుర మయ్యె నివ్వటిల్లంగ

---

౧. భరతితోడి, ౨. చెలియలుగాను, ౩. ండె.

నిక్కంబునకుఁ గరుణ[1]ంచితి ననుడు
శంకరవల్లభి శాంకరిఁ దలఁప
శాంక[2]రీపుర మనఁ జనియె లోకముల
నాశాంకరీపురంబంద నాయునికి
శ్రీశైలమునకు వచ్చితి, వచ్చి యంత
నిర్జితపాపు ననిర్జితమహిము
నూర్జితయశు మల్లికార్జున దేవు
నత్యర్థిమై సమభ్యర్చితుఁ జేసి
నిత్యంబు సత్క్రియానిష్ఠ ముప్పొద్దు
సంధిల్ల నానాసుగంధప్రసూన
బంధురీపూజానుబంధప్రబంధ-
పటు[3]రభసోద్యుక్తిఁ బరమప్ర[4]సక్తి
స్ఫుటభక్తియుక్తి సంపూజ్యుఁ గావిం[5]చి
[6]తనపౌరు లిలఁ బుష్పదంతుఁ డనంగ
ననయంబు వర్తింప నట్లొక్కనాఁడు
పూవులవడుగు లీ పుష్పవాటికలఁ
ద్రోవఁ జూపుడు వచ్చి తుదిశాఖ నున్న
కరవీరపుష్పముల్ గమియంగఁగోయ
నిరవుఁ జూపుచు శాఖ లే నెక్కనెడను

౧. రి, ౨. మ, ౩. తరసో, ౪. శ, ౫. ంప, ౬. తనుజారు.

గీతవాద్యము జనాకీర్ణఘోషణము
నాతతపంచమహా[1]వాద్యరవము
చప్పుడు దిక్కుల౯ గప్పుడు బ్రమసి
యప్పుడు గతిక్రీలు దప్పుడు౯ గ్రిందిది
కొలనిలో వడ౯కుచు గుబ్బ[3]న వడుచు
నల[4]రి నాగాంగన లర్థి౯ దన్ బట్టి
పూర్వజన్మమున నీ భోగనాథున క-
పూర్వపూజాబంధములు విరచింప౯-
గా నొక్క పద్మంబులో నొక్క తేటి
దా నొక్క౯ డున్నయా తప్పున౯ జేసి
భూవలయంబున౯ బుట్టితి దొల్లి
పూవులవడుగవ కావున నట్లు
శివుడు౯ గారుణ్యంబు [5]సేసె రమ్మనుచు
నువిదలు గొనిపోవ నురగిలోకమున౯
గలితభోగావతీగంగాప్రవాహ
పులినతలంబున౯ [6]బొడమ౯ దతక్షణమ
దివ్యతేజమున జాతిస్మరత్వమున

౧. శబ్ద, ౨. ంవ, 3. బ్బు, ౪. రు, ౫. జేసి, ౬. ల, ౭. బొరలనతక్షణము, ౮. గ.

ఈ పాదమునకు వెనుక "పావకాంబకు భోగవతి శాపమునను" అని ఒక ప్రతిలో అధికపాఠ మున్నది. దీనికి సం. అనువాదమ్ము లేదు.

దివ్యాంగనలపల్కు- దృఢముగా [1]నెఱుఁగి
శ్రీభోగిశాట్సమర్చితపాదపద్ము
నాభోగనాథు నత్యర్థి భజించి
తరుణతరారుణతరణివిస్తరణ-
కిరణాపహరణవిస్ఫు[3]రణమాణిక్య-
కలశ విభ్రాజి తా[2]గణితార్బుదప్ర-
భలఁ [4]జెంది లోకసప్తకమును వెలుఁగ
ద్వారాష్టకముల భవంతి పంక్తులను
జారుమండపముల సహజవేదికల
భూరి[5]వప్రముల గోపురముల దివ్య-
తోరణంబుల సర్వతోభద్ర మనఁగ
భ్రాజిల్లు దివ్య విస్ఫార తేజో వి-
రాజితమగుచుఁ దత్ప్రాసాద[6]మమర
నష్టదిక్పతులు మూర్త్యష్టకంబును ని-
జాష్టమహాహి సహస్రముల్ గొలువ
హరివిరించ్యాది సురాసురప్రముఖ-
గరుడగంధర్వసంఘంబులుఁ గొలువ
శుంభత్ప్రమథగణ స్తోమంబు గొలువ

---

౧. నెరిగి; దెలసి, ౨. ర్ఫ. ౩. రిత, ౪. గిండె, ౫. భద్ర, ౬. ములర.

జొచ్చుడు నిది యేమి సోద్యమో యనుచు
నచ్చటి కేఁగి యా యయ్యకు మ్రొక్కి,
"యెక్కడ నుండుదు రెవ్వరు మీరు
నెక్కడియాఁబోతు మ్రొక్కెద రేల ?
యెక్కడ కేఁగెద రిం దేమిసిద్ధి
నిక్కంబు సెప్పుమా నీమాన" యనుఁడు
"వినవయ్య యిధి మాదివ్యవృషభంబు గర్మ-
జనులకు నేఁబొందుసందమై తోఁచు,
జగములో రెండవు శంభుం డనంగఁ
బొగడంగ నెగడు శ్రీ భూధరాగ్రజుఁడు
ధర్మావతారుండు[1]దాంతుఁ [2]డుద్భూత-
కర్ముండు నాల్గుయుగంబులయందు
ధర్మంబు నాల్గువా[3]దంబుల నడుచు
ధర్మ మన్యోన్య యుగాంతరముల నెఱిఁగి
తద్ధర్మ మీమూర్తి ధరియిం[4]చి యిజ్జ-
గద్ధితార్థం[5]బిజ్జగంబున నుండు
జను లెవ్వరేనియు సప్తరాత్రంబు
లనశనవిధి సదైకాగ్రచిత్తమున

---

౧. డుదాత్త, ౨. డుద్భూత, ౩. దములుగా, ౪. ంచనజ్జ.
౫. ంబుజా.

నాబిలద్వారంబునం దుండఁగా ద-
యాబుద్ధి నా వృషభాంశుఁ డేతేరఁ
దొలఁగ కా వృషభంబు తోఁకఁ బట్టుడును
బిలములోపలికి సంప్రీతిఁ గొంపోవు
నల మనోవేగ[౧]ంబునను గొనిపోయి
పొలుపారు వృషభేంద్రపురసమీపమున
నావృష[౧]భాంశుండు న ట్లదృశ్యముగ
భావించి యావృషభపురంబు [౨]నడిమి
వృషభతీర్థంబాడి వేడ్కఁ దత్క్రతులు
వృషభేశు నర్చించి [౩]వినమితు[౪]లగుచు
నావృషభే[౫]శుండు నంత బ్రత్యక్షు-
డై వారి కొసగు దృష్టాదృష్టసిద్ధి
వారిలో మోక్షాభివాంఛితు లైన
[౬]వారల నందికేశ్వరపురంబునకు
ననుచుఁ దదీయమోక్షా[౭]వాససుఖము
ననుభవింపఁగఁ బంపె నట్లును[౮]గాక
మణిగణాసికముల్ మంత్రముల్ దేవ-
గణి[౯]కోపభోగముల్ గామరూపములుఁ

---

౧. భాంశుండు; భేశుండు, ౨. నడుమ, ౩. విస, ౪. లుగను, ౫. భేశ్వరుండంత, ౬. వారక (జ), ౭. దాన, ౮. గాఁగ, ౯. కావిభా.

గామదుఘంబులుఁ గల్పవృక్షములుఁ
గామితాలోకలోకప్రవర్తనలు
సంజీవ సంధాన శల్యాదికరణు
లంజన రస రసాయన ధాతుకళలు
మృగచోర రాక్షస మృత్యు విషాహి -
ఖగమహోల్కాశని ఖడ్గసేనాగ్ని -
పవన[1]జలాతప ప్రతిపక్ష[2]రోగ -
పవి నృపస్తంభన పరిచితకళలు
గారుడాదులుఁ బరకాయప్రవేశ -
భూరిదివ్యౌషధంబులు మొదలైన
దృష్టసిద్ధులు గోరుదృష్టా[3]ర్థులకును
దృష్టసిద్ధుల నిచ్చు దేవుఁ[4] డిచ్చటను
దమనిజావాసముల్ దలఁపంగ నపుడ
విమలాత్మరుచిఁ బొల్చు వృష[5]భేంద్రమూర్తి
వచ్చుఁ దొల్లిఁటియట్ల వాలంబుఁ బట్టఁ
దెచ్చు బిలము [6]వెడలఁజొచ్చు నబ్బిలము
నట్లు[7] కా నెఱుఁగి యిష్టార్థముల్ వడసి
యిట్లు వచ్చితి నంచు నేఁగె వెండియును

౧. బాలా, ౨. రాగ, ౩. త్థ, ౪. డెప్పుడును; డిచ్చుడును, ౫. భైక, ౬. లెల్ల, ౭. యేనేగి.

[౧]జని [౨]నిర్జన ప్రదేశంబున నొక్క
వనమధ్యమున ఫలావళులు [౩]నేఁ గోయ
భువినుండి యొక[౪]తాడి దివిదాఁకఁ బెఱిఁగి
దివినుండి యట్ల[౫] క్రిందికి దిగఁబడఁగఁ
గదల కేఁ దాళవృక్షముఁ జూడఁ బ్రొద్దు
గదియఁ దత్తాళవృక్షముతుట్టతుదిని
శతరుద్రుఁ డొకఁడు శ్రీశైలేంద్రుఁ జూడ
నతులవృక్షారూఢుఁడై వచ్చె [౬]ననఁగఁ
బాలార్కరుచిఁ[౭]దనుప్రభలు వొల్పార
దాళాగ్రమున నొక్కతపసియుఁ దోచెఁ
దపనుండుఁ [౮]గ్రుంకఁ దత్తాళంబుఁ గ్రుంకెఁ
దపసియు ధరఁ[౯]జిక్కెఁ దానంతఁ గదిసి
"[౧౦]తా డెట్లు దివి కేఁగె? ధర నెట్లడంగె?
[౧౧]నోడ కెట్టులు మీఁద నుండితి వీవు?
నందు నెవ్వరిఁ గంటి? వగుసిద్ధి యేమి?"
వొందు డెట్లయ్యె నీ భూజంబు నీకు?
ననవుడు శ్రీగిరియంద యేప్రొద్దు

౧. చన, ౨. నిర్ఝర, ౩. ల, ౪. త్రాడు, ౫. ల్ల, ౬. నాఁగ, ౭. చన, ౮. గ్రుంకుడు దానును, ౯. జిక్కి, ౧౦. తానెట్లు, ౧౧. నూనె.

వనముల నడవుల వర్తింతు నేఁడు
ననఘ యీ ప్రాంత మేకాంతంబు గాన
చనుదెంచి యుదయమజ్జన కాలమునను[1]
జర్చింప లింగవశమున నిచ్చటన
కూర్చుండి యేను లింగార్చన సేయఁ
దుదల నర్కాంశులు దో[2]ప సీతాడి
తుదలయాఁకులు తుట్టతుదలను దోఁచె,
నుదయాద్రిరుచులు దళ్కొ[3]త్త నీమ్రాన
నుదయాద్రిరుచులును దుద[4]లఁ దళ్కొత్తె,
మొద[5]లియాకిరణముల్ మొలవ నక్కుజము
మొదలియాకుల మొట్టమొదళులు మొలచెఁ,
గదిసి యాద్యుతులు సాఁగంగ నీద్రుమము
గదిసిన మీఁదటికొమ్మలు సాఁగెఁ,
బొదలుచు రవియును బొడ[6]మ నిత్తరువుఁ
బొదలుచు [7]నినుఁ[8]జూడఁ బొడమెను మునుగఁ
జక్కన్న లింగావసర వేళ గాన
యక్కడిక్కడ సూడ కట్ల యుండెత్రి[9]ని,
గ్రాలు నంబునుమధ్యజిర్ణికభాతిఁ

౧. కు, ౨. లు, 3. త్తునీతాడి, ౪. లు, ౫. లనా, ౬. వ, ౭. నను, ౮. గూడ, ౯. మి.

దాళాగ్రపత్రమధ్యమున నేనుండ
రవిరథంబేఁగు తీవ్రమున నీతరువు
దివిదాఁకఁ బెరుగుడు రవియు మధ్యాహ్న-
వేళ నీచనుతాళవృక్షంబుఁ గదిసి
నాలాంఛనంబును నన్నును జూచి
సముచితసత్కారసంతుష్టుఁ జేసి
యమలాత్మ యీప్సితం బడుగు నావుడును
ఫలితపర్వతసార్వభౌమాతిశయత
నొలయు శ్రీగిరియు నా కున్కిపట్టని,
నజ హరి [1]యుష్మదా ద్యమరార్చితుండు
త్రిజగన్నుతుండు ముక్తిప్రదాయకుఁడు
సుమహదపారభాసురదయాంభోధి
ప్రమథనాయకుఁడు శ్రీపర్వత[2]ప్రాణ-
వల్లభుఁడైన శ్రీ మల్లికార్జునుఁ[3]డ
తెల్లంబు నా ప్రాణవల్లభుఁ డేనిఁ,
బన్నగాంకుని వ౹ కన్నైన నిన్ను
గన్నులారఁగఁ జూడఁగాఁ గంటినేని,
వేఁడ నింతటిమీఁద వేఱొండు[4]వరముఁ
బోఁడిగా నున్న దే భువనలోచనుఁడ

---

౧. విబుధపా, ౨. తు, ౩, డు, ౪. విధము.

యేమియు నే నొల్ల నీతాళవృక్ష
మీమహి నుదయింప నేమిగారణము?
సనఁజనఁ గొనసాఁగుశక్తి యీవృక్ష
మున కెట్టు లెసగెను మోచు [1]డేమిటికి?
యెప్పటిభువిఁ గ్రుంకు [2]డేమి [3]విధంబు ?
సెప్పు మిం[4]తియ చాలు శివనేత్ర" యనుడు
"శ్రీగిరి దనహాళి సృజియించెఁ బుణ్య
భాగుం[5]డ మర్త్యుల బ్రదికింపఁ దలఁచి
సూర్యవనంబును సూర్యనగంబు
సూర్యకుండంబును సూర్యేశ్వరంబుఁ
దా వెండియును సూర్యతాళము నసఁగఁ
గావించె నిహపరకాంక్షాపరులకు
సూర్యకుండం బాడి సూర్యేశుఁ గొలువ
సూర్యపదం బగు సూర్యాత్ముకరుణ
ద్వాదశాదిత్యులుఁ దమతమపదవు
లాదిని సూర్యేశు నర్చించి కనిరి,
దా నుదయింప నీ[6]తాడియుఁ బొడుచుఁ,
దా నస్తమింప నీతాడియుఁ గ్రుంకుఁ;

౧. శే, ౨. టిదియేమి, 3. కారణము, ౪. ౧త. ౫. ల, ౬. ంచనప్పుడు, ౭. తాడును.

బురహరుకృపఁ దాళభూరుహం బెక్కి
యరుగుదెంచినవారి కభిమతం బిత్తుఁ,
దన[౧]ర నీగిరిఁ జంద్రతాళంబుఁ గలదు,
జను[౨]లట్లు సనుదేరఁ జంద్రుండు విచ్చు
లీల నక్షత్రతాళీసమూహములు
శైలంబు[3]నం దట్లు సరియింపుచుండుఁ
గావున చోద్యముల్ గల[౪]విట్టు లొండు
నీవు గామింపవేనియును దప్పేమి* ?
ఘూనితాంబుజ రాగమణు లివే కొనుము,
ప్రాని శ్రీగిరినాథుఁ బూజింపఁ బొమ్ము"
ననుచు నంతట సూర్యుఁ[౫]డరుగ నీతరువు
సనుదెంచి యట్లు యీజగతిలో నడఁగె
నని చంద్రసూర్యతా[౬]ళాది వృక్షముల
ఘనమహత్త్వముఁ జెప్పఁగా వింటి మఱియు
వెండియు నొకనాఁడు విపినాంతరమున
నుండంగఁ దనమ్రోల [౭]నొండొండ భీతు

---

౧. పత్రి, ౨. లి, 3. సంధిల్ల, ౪. విట్లునొండు; విట్ల యొండు, ౫. డరిగె, ౬. రా, ౭. నొక్కొంతు.

* ఈపాదము తరువాత "యేనిత్తునడుగు నీకేదియునైన" అని ఒకప్రతిలో అధికపాఠ మున్నది. దీనికి సం. అనువాదము లేదు.

గొని [1]యురంబున నంటుకొని యొక్క యర్భ-
కునిశ్వసం బుండంగ గుబ్బన పడుడుఁ
జక్కన నేఁ జేరఁ జని "విభీతాత్మ!
యెక్కడనుండి నీ వేతెంచి పడితి?
వడఁగ గర్భంబులో[2]పలి పాపవీనుఁ
గుడుగక యురమున నునికి యె ట్లను[3]డుఁ
"బురమున నుండి యేఁ [4]బుష్పంబులకును
గర మురువడిఁ బాఱఁ గడుపు గలంగ
జలతీరమునఁ జేతిసజ్జయుఁ [5]బెట్టి
యిల[6]నొక్క కొంతద వ్వేఁగి కూర్చు[7]ండి
మావర[8]వాటిక మఱిశంక లేక
నో[9]వెట్టి కూర్చుండు[10] డుచితమే యనుడు
దిగ్గన లేచి [11]నద్దెస[11]లును జూచి
బగ్గించి పలు[12]కుశబ్దం బెట్లు దోచె
నిక్కడ నూరు లే దిల్లు లే దనుచు
నక్కడ నొక[13]ఊత్రి [14]నిక్కగాఁ బెట్టి
చక్కన యొక్కింత సని కూరుచుం[15]డ

౧. పు, ౨ పల, ౩. నిన, ౪. పుష్పకంబులకు, ౫. జేటి, ౬. నొక, ౭. ంష, ౮. రువాకి, ౯. డెను, ౧౦. నాల్, ౧౧. లను, ౧౨. క, ౧౩. ఊయి, ౧౪. నింక, ౧౫. ండి.

నక్కడ నిట్టాల యట్టికక్కు వెట్టి
యక్కడకక్కడ కరిగి కూర్చుం[1]డ
నక్కడకక్కడ కట్ల వారింప
నిక్కలు వెట్టుచు నిల దూర మేఁగి
చక్కన మఱి బహిశ్చరణంబు[1] నేసి
శౌచాచమన బహిస్స్నాన క్రియాను
లాచరించి మదీశ్వరార్చన సలిపి
ఘనతరంబుగ దొప్ప కరము[3] నఁబట్టి
యనుపత్తి నేఁగి యన్యోన్యయిక్క లున్న
కందువ[4]లందు "భిక్షాం దేహి"[5] యనఁగ
సుందరుల్ దమయొడల్ సూపఁ[6]క వచ్చి
యందఱు [2]నత్తఱిదివ్యాన్నాదులన్ని-
గందువలందు భిక్షములు వెట్టుదును
బరఘున కారగింపఁగఁ బెట్టి కుడువ
సరసదివ్యాన్నభోజనమహాత్త్వమున
నప్పుడు గర్మక్షయంబు నాకగుడు
నప్పరవరము సయ్యాన కానవచ్చె
నందు దద్దివ్యకన్యారత్న మొక్క-

---

౧. దీర్ఘ, ౨. హ్రుస్వ, ౩. ల, ౪. యం, ౫. యనిన, ౬. ఁగ, ౭. స. ౯. లిచ్చి.

సుందరి సర్వాంగసుందరి వచ్చి
తనగృహంబునకు నుదాత్తసంప్రీతి
నను గొనిపోయి యున్నతహర్మ్యమునను
నునిచి యభ్యంగక్రియోపేతుఁ జేసి
యనుపమదివ్యాంబరావలు లిచ్చి
బంధురషోడశాభరణసంధాన-
గంధమాల్యాదిశృంగారంబుఁ జేసి
ప్రియలరు దివ్యాన్నపానాదులఁ దనిపి
ప్రియలరు తాంబూలాదు లర్పించి యంత
పరిరంభించి నన్ననవరతసంభోగ
సురతసుఖాంబుధిఁ జొక్కించుచుండ
ననుపమదివ్యవర్షానేకకోట్లు
ననఁగఁ దద్గర్భంబు నతి కైనఁ జూచి
చిక్కె నా కీ [3]సతి దక్కెఁ బొమ్మనుచు
నొక్కింత దలఁపన యుగ్మలి యొఱుఁగ
చెచ్చెర గర్భంబు వ్రచ్చి యర్భకుని
బుచ్చి నాపై నటు వొమ్మంచు వైవ
నెప్పుడో వచ్చితా దొప్పన పడితి
నిప్పాట" నని చెప్ప నిది వింటి మఱియు

1. రాంసు, 2. యమిత, 3. ర.

## పర్వత ప్రకరణము

సరిగితి [1]నట వినోదార్థమై దూర
మరుగ నరుగ నొక్క గిరికందరమున
నొక్కయ్యా బిలములోనుండి యేతేర
నెక్కడనుండి మీ రేఁగెద రనుడు
నిది పాపబిల మందు రీద్వారమునను
గదలక దినసప్తకం బుండ నొక్క-
యువిద [2]యబ్బిలములోనుండి యేతెంచి
సవినయంబు[3]గఁ దన చాఁకిటిపాప
నిటు వట్టు మన చేతి కిచ్చుచుఁ బోవఁ
గటకట నేడ్చుచుఁ గఱచుచు వ్రచ్చి-
కొనుచు గోళ్లల దుస్సికొనుచుఁ దోళ్లొలిచి-
కొనుచుఁ గండలుఁ గొర్కికొనుచు సాధకుని
తనువుమాంసం బెల్ల దరిమిడి కూడఁ
దినఁగ నెమ్ములు దక్క ధృతిపెర్మి నతఁడు
గలఁగక సండ్లిలగఱవక చనక
[4]యాలుగక యులువక హాయన కచ[5]టు
గదలక మెదలక కర మడ్డ మిడక
యదరక బెదరక [6]యఱఁగలిగొనక

౧. నటు, ౨. యు బిలములో, 3. న, ౪. నల, ౫. ట,
౬. యక్కటా యనక.

పెక్కుక నుసలక వీఁగక మసల
కొక్కింతయును గొంకకున్నను మెచ్చి
జనని యప్పుడ వచ్చి తనకూఁతుఁ బుచ్చి-
కొని దివ్యదేహ మెక్కుడుకూర్మి నిచ్చి
యావామ వెండియు నభిమతసిద్ధి
గావించు ననిఁ బిలకల్పోక్తి నట్లు
తలరక తను వొగ్గి తనమనోరథముఁ
బాలఁతిచేఁ బడసి[1] యోఁ బోయెద ననుచు
యోగవాగలు మెట్ట నుద్యుక్తుఁ డగు[2]చు
వాగలు గిరులపైఁ బదిలమే యనుడు
వాగ లూరక[3] రావు వడసి[4]తి యోగ-
వాగ లెట్లన్న నీపర్వతాగ్రమునఁ
గరమర్థి శ్రీపాదుకాసిద్ధనాథుఁ
బరగుశూలంబుల వాగలు వెట్టి
యెలమితో వేయును నెనిమిదిమార్గ్లు
వలగొని ప్రెక్కుచు వచ్చి కల్పోక్తిఁ
బథమిడిపోవుచోఁ బర్వతాకృతిని
బ్రథితమై యొక్కసర్పంబున్న దాని
వదనంబు బిలమని వడివడిఁ జొచ్చి

౧. నే, ౨. డు, ౩. కావు ౪. న, ౫. సిద్ధి.

యది వాముకపుపులో నౌటయెఱుంగి
సర్వజ్ఞభోజునిఁ జంపంగవచ్చు
గర్వనాగంబు నుక్కడంచినసూక్తి
నిల "నన్యథా శరణం నాస్తి" యనఁగ
నిల "రక్ష రక్ష మాహేశ్వర" యనఁగ
మహితమంత్రంబు సన్నుతి ననుష్ఠింప
నహిపతి వ్రక్కలై యఱచుచుఁ ద్రెళ్ళె,
నిని యొక్కసర్పముఖ్యవృత్తిఁ దత్క్షణము
చనుదెంచి తొలఁగి పోఁ జనఁగఁ దచ్ఛవముఁ
జక్కల్పి యారెండు వ్రక్కలుఁ గూర్చి
వ్రక్కన సంధానకరణి ముట్టించి
యురగంబుఁ గొనిపోయి నుమిసె సంధాన-
కరణియు నంత నేఁ గని పుచ్చుకొనుచు
నరుగుచు నుకెరొక్క సరసిజాకరము
దరిఁ ద్రొక్క జలములు ద్రావు నపేక్ష
ముట్టుచు నుదకముల్ ముట్టినచేయి
ముట్టినంతోన త్రైగి ముంపఱఁబడుఁ
జట్టినతునుకలు సంధానకరణి
ముట్టింపఁ గఱమొప్పె ముట్టకే నట్టె

౧. ణ, ౨. పింప, ౩. వ్వ, ౪. నె, ౫. ష్ప.

యుదకముల్ [1]గుళిగలో నొకకొన్ని గొనుచు
గదలి [2]కర్తరిపాణిగా [3]నంత యెఱిఁగి
యరుగంగ నెదుర మదాంధగజ[4]ములు
వరిగొని తనమీఁదఁ బఱతేరఁ గాంచి
కర్తరిపాణి యా కరులపైఁ జల్ల
మత్తేభములు దున్ని మగుడిపాఱంగ
నంటుజా లంటిన నటు గొన్ని సిక్క
నంటుజాలకుఁ [5]జన కం దొక్క గజము
దనతుండమున శి[6]లోదక మప్డు దెచ్చి
చననీని యంత్రాల సందు[7]లఁ జల్లఁ
బాసి యేనుఁగు లేఁ[8]గెఁ బట్టితి[9]వెల్ల
నాశి[6]లోదకము లే నంత ముంద[10]టికి
నరుగంగ నరుగంగ నంటుజా లంటఁ
దరమిడి తచ్ఛి[6]లోదకములు సల్ల
విడుచుడు నంటుల వేనవేల్ [11]దాఁటి
పుడమియు దిశలు నభోవీథిఁ గ[12]ప్పి
యోజనోత్సేదంబు యోజనాయతము

---

౧. గలిగిలో; గళగళ; గరిగలో, ౨. కర్తరివాణి, ౩. నెం ౪. ంబు, ౫. బోకయుం, ౬. రో, ౭. ల, ౮. గ, ౯. గోళ్ల; గాళ్ల, ౧౦. టి, ౧౧. దాటు; నాటు, ౧౨. ప్ప.

యోజనవిస్తీర్ణ మొకవృక్ష మున్నఁ
గనుఁగొని [1]యిదియ మార్గం బని యెక్కఁ
దచినకాఁడ నొకకోఁతితనువు వాటిల్ల
న[3]మ్మేయి విడువక నామ్రానికొమ్మ
కొమ్మ దప్పక యుఱుకుచుఁ బోవఁబోవ
నాఁకలి పుట్టుడు నం దొక్కఫలము
వీఁకతో నమలంగ వేగం[4]బ తనకుఁ
జిలుకశరీరంబు సిద్ధింప నంతఁ
జిలుక[5]నై యామ్రానఁ జిక్కక యరుగ
శ్రమము దోఁచుడుఁ బుష్పశా[6]ఖపైఁ బుష్ప
సమితియ శయ్యగా శయనించియుండఁ
దన కంతఁ దుమ్మెదతనువు సిద్ధింప
ఘనపుష్పపరిమళకాంక్షఁ జిక్కకయుఁ
గడఁకఁ దద్వృక్షశాఖాతతిఁ గడచి
యుడువీథిఁ జన నొక్క యుర్వీధరంబు
పడఁకువ నొక్కతాపసి యున్న వారి
యడుగులఁ బడుడు భృంగాకార[7]మెడలి
తనకు దివ్యాంగ మా తాపసి యొసగఁ

౧. య, ౨. కండ; శండ, ౩. మ్మేను, ౪. ంబె, ౫. యై, ౬. ఖిపైఁ; ఖనైఁ, ౭. ముడిచి.

బెనుపా[1]రి ఖేచరీబల మిదే యింక
ముందెడుమంటలమాడ్కి నెల్లెడల
నుండు మండుచు నవి యోషక త్రొక్క-
నినుపడు నవి యోగవాగలై నీకు
ననుడు నే న ట్లేఁగి యచ్చోట రెండు-
మంటలు దత్కృపామహిమ మెట్టుడును
బట్టింప కవి యోగవాగలై తనరెఁ
బడసితి నీయోగవాగ [3]లీక్రియను
బడసి సహస్రాబ్దపరిమితం బయ్యెఁ
బర్వతాధీశుశుంభత్కృపఁ జేసి
సర్వసిద్ధులును సుసాధ్యంబు లయ్యెఁ
గడఁకఁ నీయోగవాగలు మెట్టఁ గలుగఁ
దడయక ఖేచరత్వంబు సంధిల్ల
నేలోకము[4]లకు నా కేఁగంగవలయు
నాలోకములకుఁ జయ్యన బోనిపోవ
భోగవతికి నేఁగి పుణ్యోదకములు
నాగలోకస్వర్ణనళినముల్ దెత్తు
భాగీరథికి నేఁగి భవ్యోదకములు
బాగొందు తత్తటప్రసవముల్ దెత్తు

---

౧. ర, ౨. లే, ౩. లే, ౪. గ, ౫. న.

మందాకినికి నేఁగి మహితోదకములు
గెందామరలుఁ దెత్తుఁ గ్రియ దులుకాఁడ
మానితభక్తి శ్రీమల్లికార్జును స-
దానందుఁ బూజింతు ననుచు నాయయ్య
ననియె నెచ్చటి[1]కేనిఁ జనుడు సాధకుఁడు
విని యత్తపోధనుఁ గనుఁగొని నగుచు
శ్రీగిరిమీఁది విశేషంబు లెన్న
వాగీశ్వరునకైన వశ[2]మట్లు[3]గాదు
నెన్ని యగ్గిరిదరు లన్నిసోద్యమ్ము
లెన్ని యగ్గిరిగిరు లన్నిసోద్యములు
ననఁ జూడ వినఁ జెప్ప సాధింపఁ బడయ
ననఁ గీర్తిసేయ శక్యమె ? యింత సాలుఁ
జాలుఁ, బోయెద, నీవుఁ జాలుదే రమ్ము,
చాలవేఁ జిక్కుము, చనఁ ద్రోవనిమ్ము
జడుఁడనై యొజ్జశిష్యన్యాయమునకు
నోడఁబడ నింక నీ యుక్తులు మాను
మెట్టుదుఁ బులినైనఁ దట్టుదు భీతి
ముట్టుదుఁ దుదిఁ జలపట్టుదుఁగాని
తక్క నాగమనంబుఁ జిక్క నేమిటను

౧. కని, ౨. మెట్లు, 3. గాక.

స్రుక్క నొంటికి, వెన్క ద్రొక్క, నెత్తైనఁ
జొత్తు బిలముఁ, ద్రోచి పుత్తు విఘ్నంబు,
లుత్తు నెండ్రైనను, [౧]వత్తుజయించి,
పొదలు నీలాంఛనంబులు నిన్నుఁ జూచి
ముదలించినను బోక ము[౨]న్నంటెఁ గా[౩]క
న న్నాఁ[౪]గ శ్రీగిరినాథుఁడుఁ జాలఁ
డన్న శక్యమె నీకు? నిన్నియు నేల?
పొమ్ము, బిలము సూఱఁ గొమ్ము, జయించి
రమ్ము, [౪]మేమును నీవశ మ్మని నమ్ము,
దీవించి పంపు, మింతియ తక్కఁగాని
పోవక నిలువఁ దపోధ[౫]న పోవ
నానతి యీమల్లికార్జునదేవు
నాన నీ కింక నోం డాడిన ననుడు
మలకలఁ బడఁడ, నా మాయలఁ బడఁడ,
మలఁకువఁ బడఁడ, నా మాటలఁ బడఁడ,
తక్కులఁ బడఁడ, నా దబ్బులఁ బడఁడ,
చొక్కులఁ బడఁడ, నా చూపులఁ బడఁడ,
మఱఁగులఁ బడఁడ, నా మతములఁ బడఁడ,

---

౧. న, ౨. న్ని, ౩. ని, ౪. మే మెల్ల నీసా మ్మని నన్ను సామ్ము నీమమ్ము; మెల్లని గన్నురావించి యప్పుడు, ౫. నప్రోవ.

వఱతలఁ బడఁడ, నా వార్తలఁ బడఁడ,
జంకెలఁ బడఁడ, నా ౧సటములఁ బడఁడ,
యింకఁ జిక్కింప రా దిక్కడ ననుచుఁ
దపసి ౨యున్ననికిన తా నదృశ్యముగఁ
దపసిని గుటిలంబుతపసిగా నెఱిఁగి
తెరు విడి యూతఁ దుర్వృత్తి వట్రిల్ల
నరుగంగ నరుగంగ నంతకు మున్న
నరకు సేయక ౩మీఱి సాధకోత్తముఁడు
నరుదుగా కంచును నాభైరవుండు
బిలమువాఁకిటియందు పృథుతరార్గళము
పొలుపున నొక్క ౪బెబ్బులిరూపుఁ దాల్చి
తగ్గుచుఁ బొదలుచు బుగ్గలించుచును
మ్రొగ్గుచు మూల్గుచు మొఱకటించుచును
ముక్కువిర్చుచు బొమల్ ముడివెట్టుకొనుచు
౫ప్రక్కుచు, ముందఱ నిక్కుచు, నావు-
లించుచు, జిహ్వ సారించుచు, ౬మ్రోల-
౭గించుచు, నోసలు స్రుక్కించుచు, ౮నెదురు
దారుచు, ౯మూరుచు, ధర ము౧౦నిగాల్లు

౧. శర, ౨. ను, ౩. మా, ౪. పెంబులి, ౫. ప్రక్కుచు, ౬. నేల, ౭. నించుచు, ౮. నెమరు; మ్రోల, ౮. కు, ౯. ఖా, ౧౦. ను.

నూ[౧]రుచు, [౨]నింగల నోడియుచు, [౩]నడఁగి
నడ[౪]చుచు. మూఁతులు నాకుచు, వాల
మడఁచుచు, నేలతో నప్పళింపుచును,
నోడలు గిర్పుచు, మీస [౫]బోరగింపుచును,
గడ[౬]వలించుచుఁ, జెవుల్ గత్తరించుచును, *
గనలుచుఁ, బొన[౭]లుచుఁ, గఱవ నుం[౮]కించు
[౯]చును, గ్రుడ్లు మిడికించుచును, జూచుచుండఁ
గ్రమ మొందఁ గృష్ణ[౧౦] రక్త శ్వేత వర్ణ
సముదితశిఖిశిఖాశకలసంఘములు
వోఁడిగాఁ బెనుప్రోవు వోసినయట్లు
మూఁడువన్నెలు మేన ముడివడి కూడఁ
గరులమదంబుఁ గేసరులకోపంబు
ధర నాగవృశ్చికోత్కరములవిషము
ననలంబువేడిమి యసురులక్రౌర్య
మనిలునితీవ్రత యటు గూడ బెరసి
యాపోవ కొకరూపమై యున్నయట్టి

---

౧. కు, ౨. నింగిలి, ౩. నలగి. ౪. డ, ౫. బకెం, * ఈపాదము తరువాత ఒకప్రతిలో, "పెనమ్రగ్గదరుసుచు బిట్టురుచుచును" అని ఒక అధికపాఠమున్నది. దీనికి సం. అనువాదము లేదు, ౬. రు, ౭. నూగించు, ౮. చను, ౯. వర్ణ, ౧౦. ప.

యాపులి సాధకుం[1]డత్తఱి డాసి
పులిరక్కసునిచావు బొంకు గానోపు
జ్వలనాక్షుచే నాఁడు సచ్చెనేనియును
నిట బిలాంతరమున నెట్లున్నవాఁడు ?
నిటలాక్షునకుఁ గాక యె ట్లోడివచ్చె ?
[2]నోం డేల యిల డాగి [3]యుండెనో కాక
వెండి యావ్యాఘ్రాసురుండు దా ననఁగఁ
దపసి సెప్పినపులి దాన కానోపుఁ
దపసిచందము గాక దండిమై నిలువఁ
గలదె నా యెదుర వ్యాఘ్రంబు శీఘ్రంబ
తొలఁగకయున్నను ద్రోవ యీకున్నఁ
జిక్కఁగా కింక నా చేత[4]నిట్లున్న
నెక్కడ పొచ్చిన నేల పోనిత్తు,
దండింతుఁ దలఁకింతు ధట్టింతు నలఁతు
ఖండింతు[5]మలయింతు గతము సేయుదును
గాక[6]సైరింతునే గర్వించి తనదు
భీకరాకారంబు నాకుఁ జూపెడినె ?
యనుచు డగ్గఱుదుఁ దా నంతలోపలను

---

౧. డంతట, ౨. నోండెప, ౩. యున్నాడొకార (ని). ౪ నెట్లున్న, ౫. మండింతు; మడియింతు, ౬. సేవింతు.

ఘనరా౧రఁగాఁ బర్వతము వడ్డయట్లు
మండుచు నుల్కంబు మహిఁ బడ్డయట్లు
దండిమృత్యువు మహోద్ధతిఁ బడ్డయట్లు
ఘనఘనాగర్జనల్ గకుబంతములుగఁ
జనుదెంచి యమ్మహాశని వడ్డయట్లు
సంగతిఁ బ్రళయాగ్నిశకలముల్ వడ్డ-
భంగి నప్పులి బిట్టు వడుడు సాధకుఁడు
బెదరక బెగడక పిమ్మిడిగొనక
యదరక ౩నలఁగక యట యిట సనక
యులుకక యోడక యుత్తలపడక
యలుగక యలయక యఱఁగలిగొనక
తలఁగక తరలక ధైర్యంబు సెడక
తొలఁగక ౪కలఁగక ౫తొట్రుపుగొనక
యొకచేతఁ బులిమీస లొడిసి ము న్నట్టి
యొకచేతఁ బులిదాడ లొడక ౬చొనిపి
చరణముల్ సరణముల్ వురిగొనఁ బెన౭చి
ధర వెల్లకిల నూఁకి తాటించి యార్వఁ
బులియు నదృశ్యమైపోవ సాధకుఁడు

౧. రు తత్పర్వ, ౨. టి, ౩. నలయక, ౪. మొ, ౫. తొట్టరు, ౬. చ, ౭. సి.

గలఁ గని మేల్కన్నగతిఁ జోద్య మంది
యంత దెర్వ్వన దొంటి[1]యట్టుల [2]యరుగ
నంతకంటెను మున్న యాభైరవుండు
మూర్తి గైకొని తాన ముందఱ నెన్ని
వర్తనలను గెలువంగరా దనుచు
నంతకంతకు [3]బిలం బన్నువసేసి
యంతంబునను వహ్నియై మండుచుండఁ
దఱిఁదఱిఁ జొచ్చుసాధకునకుఁ జొరఁగ
నిఱికటమై యున్న [4]నిల వంగివంగి
పోవంగఁబోవంగఁ బోవరాకున్న
దా వెండి కూర్చుండి ధరఁ బోవఁబోవ
నెలమిఁ గూర్చుండియు నేఁగరాకున్న
నిల [5]డొంగిడొంగి యొక్కింత సనంగఁ
బొరిఁ[6]బొరి డొంగియుఁ బోవరాకున్న
సరసర ధరఁ జక్క సాఁగిలి తాఱి
యంత గట్టెదుర దావానలార్చు[7]లును
నంతరింపని ప్రళయానిలశిఖలుఁ
గఱకంపు చిచ్చుఱకంటిమంట[8]లును

౧. యట్లన, ౨. న, ౩. బలం, ౪. ట, ౫. డోఁ (డో) దో (దో), ౬. దానువోం, ౭. ల, ౮. ల.

యొఱపగు జాతిత్తి వట్టినయట్లు
దనరుచుఁ దద్బిలాం[1]తర్వీథినుండి
కనలుచుఁ [2]బొనలుచుఁ గల్లు గట్టుచును
బొంగులుచు భుగభుగభుగభుగభుగులు
భుగు లంచుఁ బెనుమంట లెగయుచుఁ జిట్లు-
చును నాలుకలు గ్రో[3]యుచును బ్రస్ఫురించు
చును [4]సెగ[5]లెదు రెక్కుచును [6]సుల్లు గొనుచు
నెడపక వారాసు[7]లెల్ల ఘూర్ణిల్లు
వడువున మ్రోయుచు వరలు ఘోరాగ్నిఁ
బొడగని పిఱిఁదికిఁ బోక సాధకుఁడు
వడిఁబడి దాన యా వహ్నిలోఁ బడుడు
నయ్యగ్ని మును దాన నైన భైరవుఁడు
నయ్యన నంతఁ బ్రసన్నుఁడై[9], "మెచ్చు
వచ్చె, నీకిప్పుడ వాంఛితార్థంబు
లిచ్చెద" నన్నఁడు "నీ విచ్చెడి దేమి?
యేఁ గొనియెడి దేమి? యెలమి నీతోడి
పాఁగెము నాపాలఁ బరమేశుఁ డుండ
నడరు నీసారూప్య[10]మడుగుదు నేనిఁ

౧. తరమునుండి, ౨. బొనరుచు; బొనలుచు, ౩. లఁ, ౪. శిఖ, ౫. కె, ౬. ము, ౭. లేదు, ౮. కిచ్చెద, ౯. చు, ప్రత్యక్షమైనిలువ, ౧౦. మడిగితి.

గడు వికృతంబు భీకరము నీరూపు
సామీప్యమేనియుఁ జను, రక్త శవ సు-
రా మాంసముల కనారతము నాలయము,
సాలోక్యమేనిఁ బిశాచ భేతాళ-
కాలభూతాదిసంకరము లోకంబు
నది గారణమున నీ యం దేమిగుడువఁ
గదిసి నీయం దేమి [1]గంటి దృష్టముగఁ,
దప్ప[2]ని యభిమతదాత వంటేనిఁ
[3]జెప్పనఁ [4]జెఱపనఁ జేటవుగాక
నటములు[5]సాలు, నన్ సాఁగిపోనిమ్ము,
గుటిలమ్ము దక్కుదక్కుము "[6]నిక్కు" మనుచు
భైరవుమాయలఁ [7]బడక సాధకుఁడు
వారక తొంటితీవ్రమునన [8]యరుగ
నర్ణవసప్తకం బది యొక్కవేళ
ఘూర్ణిల్లుక్రియ మహాఘోషణ వనర
రంగత్తరంగ లుప్పొంగఁ బాతాళ-
గంగము వచ్చిన కనుమయో యనఁగ
బిలమున కెదురెక్కు పృథులప్రవాహ-

---

౧. గట్టె(ట్టి), ౨. క, ౩. చెప్పిన(లి), ౪. జెరిపినన్, ౫. మానెను, ౬. నిక్కు, ౭. బడుదు; బపడు, ౮. యేగ.

జలము ముందటఁ గాంచి సాధకోత్తముఁడు
నుబ్బుచుఁ దత్ప్రవాహోర్మిస్థలమున
గుబ్బున పడి సాధకుఁడు మున్గి లేచు
నంతన దివ్యాంగ మడుగుత ద్దేహ-
కాంతి దిగంతవి[1]శ్రాంతమై వెలుఁగఁ
దను దాన చూచి సాధకుఁడు హర్షించి
చనఁజన నెదుర భాస్వద్రత్నఖచిత-
మైన సువర్ణదేవాలయోపాంత-
మానిత రమ్యహర్మ్యస్థలంబునను
గాంచనాంచిత కాంతిఁ [2]గడు నొప్పు భేరిఁ
గాంచి తద్దివ్యలింగము[3] భజియించి
తవిలి యా భేరి సాధకుఁడు వాయింప
దివిజాంగనలు సముద్వృత్తి నేతెంచి
యతని నైరావతేంద్రారూఢుఁ జేసి
సతులు [4]దోఁకొనిపోయి స్వర్గలోకమున
నదె కల్పభూరుహం బదె కామధేను
వదె యూర్వశీప్రముఖాంగనానీక
మదె యమృతం బదె యజరామరత్వ

౧. క్రాం౧. ౨. కరమొప్పు, 3. గంబు భజించి, ౪. చేకొని.

మదె యణిమా [1]మహిమా ద్యష్టసిద్ధి
సదమల దేవేంద్ర సామ్రాజ్యలక్ష్మి
యదె యిందులోన నీ [2]కభిమతం బెద్ది
యది వరియింపు మీ" వనుచుఁ బ్రార్థింప
ముదము [3]మనంబున ముప్పిరిగొనఁగ
సాధకుం డభిమతైశ్వర్యభోగముల
బాధిత సౌఖ్యసంపదఁ దొప్పఁదేలి
యవికల దివ్యవర్షానేకకోట్లుఁ
వివిధ దేవేంద్రాదివిపులభోగములుఁ
జెంది యంతట [4]మీఁది శివలోకసుఖము
లందు నిట్టివి దా మనంత బిలంబు
లెందు శ్రీనగముపెం పేమని చెప్ప?
నిందుమహాళియ మెర్గు నిట సూడు మింక
నురుతర శ్రీపర్వతోత్తరద్వార-
వరమహాత్త్వంబుఁ దద్ద్వారవాస్తవ్యుఁ
డైన మహేశ్వరోద్యల్లింగమూర్తి
మానితం బగు[5]గుప్త మాహేశ్వరంబుఁ
జరు[6]కేశ్వరంబును సంధ్యాసమాధి

---

౧. దికమగునష్ట, ౨. కను, ౩. మదంబున, ౪. మీద; లోన.
౫. స, ౬. దే.

గరుడేశ్వరంబును గాలప్రాదేశ్వ -
రంబుఁ బాపవినాశనంబు గణేశ్వ -
[1]రంబు దేవప్రాదేశ్వరంబు సిద్ధేశ్వ-
రంబును నీలప్రాదంబును నాఁగఁ
బంచి యేకాదశభవ్యతీర్థములు
మొదలను శ్రీచతుర్ముఖబసవేశ -
పదపద్మములు [2]భజింపక భజించినను
గరము నిష్ఫలము లేకాదశతీర్థ -
వరలింగదర్శనవందనార్చన[3]ము
తెట్టన్న శ్రీనందికేశుండు లేని
యట్టిలింగోపాస్తి యట్టిద కాన
యూసక్తి నట్లు కన్యాసిద్ధనాథు
ప్రాసాద[4]పూర్వదిగ్భరితమై యొప్పు
భూవరేణ్యుఁడు స్వయంభూలింగదేవ -
దేవు నయ్యమరావతీపురిఁ జూడు
తివిరి మందాకినీతీరోత్తరమున
దివిజవంద్యునిఁ జూడు దేవు నింద్రేశు
దర్పితపాపారిఁ దల్లింగ[5]మూర్తి

౧. రంబును దేవప్రాదంబు, ౨. భక్తి భజియించి మఱియు, ౩. లు, ౪. మదిమె, ౫. మునకు.

దూర్పునఁ జూడు సంస్తుత్యమై గుప్త-
మాహేశ్వరం బొప్పు, మహితతల్లింగ-
మాహాత్మ్య మది యవాఙ్మనసాత్మకమ్ము,
నవుల నేలేశ్వరం బనఁగఁ దూర్పునను
భువి¹లింగములుఁ గుండములు నగంబులును
* (²విహిత ³రత్నచ్ఛాయ వెలుఁగులింగములు
మహి నొప్పుతీర్థముల్ మఱియును గలవు,)
+ గామితస్వర్గమోక్షప్ర⁴దోత్తములు
⁵రామేశ్వరంబు⁶నుమామహేశ్వరము
సంగమేశ్వరమును జరమేశ్వరంబు
సాంగమూలస్థాన ⁷మచలేశ్వరము ది-
లేశ్వర⁸సిద్ధము త్రీశ్వర గౌత-
మేశ్వరాదులఁ జూడు మిల శిలాచయము
వేదపర్వతమును శ్వేతాద్రి నీల-
మేదినీధర మశ్వమేధశిలోచ్చ-

---

౧. నగంబులు లింగములు గుండములును, ౨. విమల, 3. రత్నప్రభాయ, ౪. దత్త, ౫. మాహేశ్వరంబును రామేశ్వరంబు, ౬. వరాహేశ్వరంబు, ౭. జమరే; జబలే, ౮. సిద్ధి.

* ఈ రెండుపాదములకును సంస్కృతానువాదము లేదు. + ఈ పాదమునకు సంస్కృతానువాదములో "అభీప్సితస్వర్గమోక్షదానదక్షాణిచ క్షితౌ" అని ఉన్నది. దీనికి సరియైనపాఠము కనబడలేదు.

యంబును లింగశృంగంబుఁ గన్యాన-
గంబు నుమాగిరి గనకనగంబు
గుండశిఖరి రామకుండంబు భీమ-
కుండంబును బ్రయాగకుండంబు వేద-
కుండంబునుం దిలకుండంబు నీల-
కుండంబును బిశాచకుండంబు గౌరి-
కుండంబు మఱి రసకుండంబులును న-
ఖండితలీల నొ[1]క్కటఁ జూచు మింక
నొలయ గంగాప్రవాహోభయపార్శ్వ-
ములును దొమ్మిదిసేసి పుణ్యతీర్థములు
దాని తూర్పునను మాతంగేశ్వరంబు
నానొప్పు సకలజనస్తుత్య మగుచు
శతకోటి యను మహాస్థానంబుఁ జూచు
శతముఖు[3]దెసఁ బుణ్యజనితమై యొప్పుఁ
దత్తీర్థరాజికి దక్షిణంబున ను-
దాత్త మహిమఁ ద్రిపురాంతక మొప్ప,
నాక్షేత్రమహిమ దా నది యెట్టి దనిన,——
నీక్షితి నంత్యజు లిరువురు గూడి
యతిముఱిఁ బశుకర్మ మాచరింపంగ

---

౧. క్కటి, ౨. జేసి, ౩. దేశంబు జనితమై.

నెఱిఁగి కుమారగిరీంద్రంబుచుట్టు
దొడుగులఁ [1]బఱువఁ దోడ్తోన ప్రాణంబు
విడిచి యాబల్లహుకడుపునఁ [2]బుట్టి
జాతిస్మరత్వంబు సంధిల్ల నప్పు
డేతెంచి వృత్తాంత మెఱిఁగించి తమ్ముఁ
బట్టవచ్చినఁ బాఱిపాఱి మున్ దాచి-
నట్టికత్తుల నూఁపి యచ్చెరువుగను
నాసకలముఁ జూడ [3]నంతంత క్షేత్ర -
వాసులై రాజ్యసన్న్యాసంబుఁ జేసి
జగదభినుత జజ్జు జగదేవు లనఁగ
నెగడి యకల్పితనిజపూర్వకర్మ -
లలితకుమారశైలప్రదక్షిణ వి -
పులఫలమహిమశంభునిఁ గూడి రట్టి
పృథులకుమారభూభృత్సార్వభౌము
ప్రథితమాహాత్మ్య మెబ్భంగి వర్ణింప ?
ధరఁ "బురారిధ్వజదర్శనం" బనఁగఁ
ద్వరితాగతధ్వజదర్శనఫలము
నంకింప నరు దన్న నాకుమారాచ -
లాంకిత శ్రీత్రిపురాంతకదర్శ -

---

౧. బరవ; బరుప, ౨. బుట్టె, 3. నంతత్క్షేత్ర; నందతిక్షేత్ర.

సస్పర్శనాభ్యర్చనంబులమహిమ
విస్పష్టముగఁ[1]దెల్పి విధికైనఁదరమె
యందుల భజనమహత్త్వంబునకును
గుండెలు నెలుకయు గుడి సాక్షిగాఁగ
గంధవతి[2]ని[3]దీర్ఘికా[4]తీరవాస -
బంధురాభీష్టద ప్రఖ్యాతమహిమ
భువి నొప్పు శ్రీస్వయంభూలింగమూర్తు
లవియ మూలస్థాన మగుత్రిపురాంత -
కంబును [5]గారేశ్వరంబు సోమేశ్వ-
రంబుఁ గేదారేశ్వరంబు ఖడ్గేశ్వ-
రంబుఁ బాపవినాశనంబు గౌరీశ్వ-
రంబును గపిలేశ్వరం బుత్తరేశ్వ-
రము [6]నావిము[7]క్తేశ్వరము మల్లికార్జు-
నమును గన్యాసిద్ధనాథలింగంబు
ననఁగ ద్వాదశసముద్యన్మహాస్థాన-
ఘనలింగమహిమ యక్కజ మదె చూడు,
తత్త్రిపురాంతక స్థానంబునకు వి-
చిత్రమై యొప్పు దక్షిణమున మఱియు

---

౧. నట్ల విరచింప మరియు, ౨. కి, 3. దూర్పుగాదలివాన, ౪. దరి. ౫. నాగే; కాళే, ౬. ను, ౭. క్తి.

సిద్ధవటాధ్వప్రసిద్ధపార్శ్వముల
వృద్ధగిరియు రససిద్ధేశ్వరంబు
గోశృంగమును రుద్ర[1]కోటియుఁ బశ్చి-
మాశాముఖంబును నమృతేశ్వరముఁ బ్ర-
థమమల్లికార్జునోదాత్తలింగంబు
భ్రమరేశ్వరంబును బాపవినాశ-
నంబును సుంభీశ్వరంబు ముక్తీశ్వ-
రంబును ధర్మేశ్వరంబు నింద్రేశ్వ-
రంబును బ్రహ్మేశ్వరంబుఁ [2]గాళేశ్వ-
రంబును భీమేశ్వరంబును బటహా-
కర్ణేశ్వరంబు నేకశిలయుఁ గుంభ-
కర్ణేశ్వరము గనకగిరియు జాను-
సర్వలింగము భూతిపర్వత లింగ-
పర్వత రుద్రాక్షపర్వతావలులు
ఘనతరంబగు కర్ణికారవనంబు
నను ఘటికాసిద్ధనాథలింగంబుఁ
గమలేశ్వరంబు శ్రీస్కందసోమేశ్వ-
రమును సాలంకేశ్వరమ్మును మత్స్య-
కుండ విభీషణకుండ కుమార-

---

౧. కోశంబు, ౨. గౌరీశ్వ.

కుండ రావణకుండ గుప్తకుండములు
భీమేశ్వరమును విభీషణేశ్వరము
రామేశ్వరమ్మును రావణేశ్వరము
సాలంకమత్స్యకేశ్వరమును జూడు
మోలి న[1]య్యామ్యాదమోక్షధరము[2]స
సురుచిర సముదిత జ్యోతిర్మయాం[3]గ-
[4]ధరునిఁ దచ్ఛినగ దక్షిణద్వార-
వరుని జ్యోతిస్సిద్ధవట[5]నాథు భక్త-
వరదుఁ బెన్నానదీవరతటావాసు
శాశ్వతపుణ్యు దర్శనముక్తి నలరు
విశ్వైక[6]నుతు దైవవేశ్యాభుజంగు
దేవశిఖామణి దేవదేవేశు
భావించి చూడు మేర్పడ [7]వటేశ్వరుని
నందిత వటమూలమందిరుఁ జూడు
మంద మూలసాన మైనసిద్ధేశ్వ-
రంబును[8]వరుణేశ్వ[9]రంబు యమేశ్వ -

---

౧. యా, ౨. ల, ౩. ంగు, ౪. ధరణి, ౫. సిద్ధనా[illegible], ౬. నుత, ౭. రమే. ౮. వరణే, ౯. రమునుదయేశ్వ.

రంబు నాయుదయేశ్వరంబు సిద్ధేశ్వ -
రం బిష్టసిద్ధేశ్వరంబు బ్రహ్మేశ్వ -
రం బిష్టకామేశ్వరంబును జూడు,
[1]చంద్రప్రభావుఁ బుష్పగిరివాస్తవ్యు
సింద్రేశ్వరునిఁ జూడు మింద్రపూజితుని
వందితసురనరవ్రాతు రామేశు
నంద చూడుము త్రిపురాంతకదేవుఁ
బరశురామేశ్వరు బాలకర్ణేశు
హారుని శంకరు మల్లికార్జునుఁ జూడు,
కుండీప్రభునిఁ జూడు కుక్కుటేశ్వరుని
వెండి బ్రహ్మేశ్వర విమలేశ్వరముల
సగము నరుండును సగము మృగంబు
నగు నృసింహుఁడు హిరణ్యాక్షు వధింపఁ
గా వెండి[2] (శ్రీ)నీలగళుఁ బ్రతిష్ఠించి
యా[3]వాహనము సేయు నది యాదిగాఁగఁ
బూని సంతతమును బూజించునట్టి
యానరసింహేశ్వరాదిసిద్ధేశ -
దానవేశాదులఁ దడఁదడఁ జూడు,
దానిపశ్చిమమునఁ దా నొప్పఁ బ్రమథ-

౧. చంద్రానుభావు, ౨. యా, ౩. వ, ౪. స.

నందియు నాకాశనందియుఁ గృష్ణ -
నందియు నాబ్రహ్మానందియు సోమ -
నందియు శ్రీమహానందియు గరుడ -
నందియు భగవతీనందియు భీమ-
నందియునుఁ బినాక నందియు నాగ -
నందియు నా శివనందియు శ్వేత -
నందియు భైరవనందియు గ్రామ -
నందియు మఱి యేకనందియు గౌరి -
నందియు మఱి ముక్తినందియు నింద్ర -
నందియు నా భువనత్రయంబునను
సన్నుతా[1]భీష్టార్థసౌఖ్యకారణము
ల న్నందిమండలం[2]బదె దానిఁ జూడు,
ముర్వి కొప్పగుదాని [3]యుత్తరంబునను
దూర్వాసతీర్థ ముత్సుకతమైఁ జూడు,
తరమిడిదానియుత్తరమునఁ జూడు,
మరుదగు నింద్రేశ్వరాదితీర్థములు
వంచి[4]యంతట బలభద్ర రామేశ్వ -
రంబు లాంగూలతీర్థంబును జూడు,
తెల్లంబు గూర్మప్రతిష్ఠితుఁ గూర్మ -

౧. భీష్టద, ౨. బంపదేచూడు, 3. కు, ౪. యత్తరి.

మల్లికార్జును పశ్చిమంబునఁ జూడు,
మాశ్చర్యకర మఘహర మీనగంబు
పశ్చిమద్వార ప్రభావంబుఁ జూడు,
తుంగభద్రాంకి[1]తో[2]త్తుంగ భద్రా త -
రంగిణీచారుతీరమున మోక్షప్ర -
దంబు దేవద్రోణి తత్పశ్చిమమునఁ
బంబి శ్రీవారాహ బ్రహ్మేశ్వరములు
వేదనాదావ[3]తీ వృత్తమధ్యప్ర-
[4]వాదితస్థానవిభ్రమపంక్తి[5]లోన
నమరుతీర్థాదిఛాయామల్లికార్జు-
నము గణికాసిద్ధనాథమోక్షేశ్వ-
రము[6]ను భుజంగేశ్వరము నారదేశ్వ-
రమును బ్రహ్మేశ్వర రాజరాజేశ్వ-
[7]రంబు నగ్నీశ్వర రమ్యా[8]భోగీశ్వ-
రంబును సోమేశ్వరంబును గల[9]క-
లేశ్వరంబును నాఁగ నెన్నంగఁ జను న-
నశ్వరైకాదశనవ్యతీర్థంబు
లాది శ్రీరుద్రపాదాదితీర్థముల

---

౧. తతుంగ, ౨. భారత. ౩. తీ, ౪. పా, ౫. తో, ౬. లు, ౭. రంబును నగ్నీశ్వరమును భోగేశ్వ, ౮. విశ్వేశ్వ, ౯. ఖ; గ.

కాదిమూలస్థాన మైనబ్రహ్మేశ్వ-
రము బలభద్రేశ్వరముఁ గమలేశ్వ-
రమును బాపవినాశనమును యాగేశ్వ-
రమును నగస్త్యేశ్వరమును నాగేశ్వ-
రము సప్తకోటీశ్వరముఁ గుక్కుటేశ్వ-
రము నశ్వమేధేశ్వరము లకులేశ్వ-
రమును శ్రీరామేశ్వరము లక్ష్మణేశ్వ-
రంబును ధవళేశ్వరంబు ధర్మేశ్వ-
రంబును విమలేశ్వరంబు నింద్రేశ్వ-
రంబును గర్ణేశ్వరంబు వ్యాసేశ్వ-
రంబును వరుణేశ్వరంబు మలక్షు -
యేశ్వరంబును నుత్తరేశ్వరము నన -
లేశ్వర మేలేశ్వ రేశ్వరపంచ -
లింగావలులు సప్తలింగము లుభయ -
సంగమేశ్వరములు సకలేశ్వరంబుఁ
గనకేశ్వరంబు స్వర్గద్వారసీమఁ
దనరుబ్రహ్మేశ సీతాత్రిపురాంత -
కాదులు నిజమల్లికార్జునంబును ని -
పాదితభస్మేశ పరశురామేశ్వ -
రంబులు హోమకుండంబు సిద్ధేశ్వ -

రంబు మలక్షయరసకుండయుగము
ఖ్యాపితలీల నొక్కొట (జూపు, మిట్లు
సూపంగవలె నని చూపితిఁ గాని
యాపురిలింగసహస్రార్బుదములఁ
జూపఁ జెప్పంగ శేషునకు నశక్యజము
లిన్నిగోట్లిన్నిగో ట్లిన్నిలింగంబు
లన్నను బ్రత్యవాయంబు సిద్ధించు
నెన్నియుగంబుల నెందఱు విష్ణు
లెన్నియుగంబుల నెందఱు బ్రహ్మ
లెన్నియుగంబుల నెందఱు జిష్ణు
లెన్నియుగంబుల నెందఱు మాను
లెన్నియుగంబుల నెందఱు దివిజు
లన్నియుగంబుల నంద అందఱును
నిలఁ దమతమపేళ్ల నీద్వారముశిలను
గలయ నొక్కొక్కలింగంబును నిల్పి
పరిచితాభీష్టముల్ వడయంగ భువిని
బరగు లింగంబుల పాటిబండరువు
లది లింగపర్వతం బది లింగనగర
మది లింగమందిరం బది లింగవార్ధి

౧. గను. ౨. న.

యది లింగమంజరి యది లింగరాశి
యదిలింగసురభూజ మదిలింగసురభి
గూడ నిట్లొప్ప శ్రీకుధరపశ్చిమము
నీడిత ద్వారమహిష్ఠతీర్థ ప్ర-
కరము దూర్పున జగత్ ఖ్యాపితలీల
సరినొప్పఁ గూడలి సంగమేశ్వరము
దనరారు తుంగభద్రయుఁ గృష్ణవేణి -
యును[1]గూడఁ గూడలి యన నొప్పఁ జూడ
దానితూర్పున సముద్యత్సహామహిమఁ
దా నొప్పు దివ్యతీర్థంబు నివృత్తి
మంగళతరతీర్థమహితవాస్తవ్య
సంగమేశ్వరుఁ జూడు జననాపహారణు
నిట దూర్పువలన యజ్ఞేశ్వరుఁ జూడు,
పటుదక్షయజ్ఞప్రభంజనస్థలిని
నమరేశు[3]నప్పర్వతాగ్రదేశమున
నమితేశు శ్రీసిద్ధనాథునిఁ జూడు,
మురుతరతత్ప్రవాహోత్తరాశాపి -
హారణు నక్కడఁ జూడు మయ్యగ[4]స్త్యేశు
నయ్యగస్త్యేశున కమరేంద్రు వెస మ -

౧. జూడ, ౨. జాపతి, 3. సత్పర్వ. ౪. స్త్రీ.

హీయ్యాసంప్రీతి సోమేశ్వరుఁ జూడు,
తలపోయ నయ్యుమాధరణీధరంబు
సెలువారు నదె సోమశిలఁ జూడు" మనుచు
నంత నాసోమశిలాదిమహేశ్వ -
రాంతతీర్థావలు లట్ల చూపుచుఁ బ్ర -
శ స్తమై యొప్ప త్రింశద్యోజనముల
వి స్తీర్ణమై భువి వెలయు లోకముల
సకలతీర్థములును సకలలింగములు
నొకమాత్రలోఁ జూపియును జూపిచూపి
"శ్రీపర్వతప్రదక్షిణమార్గగిరిని
రూపితలింగమూర్తులను దీర్థముల
శ్రీపర్వతంబుఁ జూచితిగదే కలయ
మీపండితయ్య కర్మిలి నట్ల చెప్ప,
కన్నారఁ జూడంగఁ గంటి గావునను
జెన్నార గిరిప్రదక్షిణము సిద్ధించె
శ్రీపర్వతప్రదక్షిణకోట్లఫలము
శ్రీ[3]పార్వతీశుఁ డర్మిలి దయసేసె
నని చెప్ప మీమల్లికార్జునపండి-
తున" కంచు[4]నప్ప డద్భుతము వహింప

౧. ౦. ప, ౨. కోటి, ౩. పర్వ, ౪. నపుడయ.

మానుగా సర్వజ్ఞమల్లికార్జునుఁడు
దా నదృశ్యం బయ్యెఁ దదనంతరంబ
చక్కన హర్షాశ్రుజలకణజాల
మక్కునఁ దొరఁగ దోనయ్య సర్వజ్ఞ
మల్లికార్జునుఁ[1]డ శ్రీమల్లికార్జునుఁ[1]డ
తెల్లంబుగా నుపదేశించె ననుచు
మల్లికార్జును మహామహిము శ్రీశైల-
వల్లభు వాయార వర్ణన సేసి
మద్గురుదేవు సమ్యక్కరుణాస-
ముద్గతమహిమామహోద్ధతిఁ జేసి
కంటి[2]మీ శ్రీపాదకమలయుగంబు
మంటి ధన్యుఁడ నైతి మఱి యట్లుఁ గాక
దిగ్ద్వారనికర విదిగ్ద్వారచయ వి-
దిగ్ద్వారమధ్యప్ర దిగ్ద్వారమార్గ-
మార్గతత్త్వద్వారమధ్యాంతరాళ-
[3]దుర్గాతి[4]దుర్గంబు దుర్గదేశముల
నటుగూడ శ్రీపర్వతాగ్రాధివాస-
పటులింగకోట్ల నేర్పడఁజూడఁ గంటిఁ
గలయ నిక్కలయగాఁ గంటి శ్రీనగము

---

౧. డు, ౨. మి, ౩. దుర్గాది, ౪. దుర్గంపు.

వలగొను శ్రీఫలావాప్తు[1]లుఁ గంటి
నిలఁ జరితార్థుండ నేనకా యనుచు
నలరుచు వెండియు నష్టాంగ మెఱఁగి
పలుమాఱు గలగన్న భావంబు నాత్మఁ
దలపోసి తలపోసి తద్గిరి డిగ్గి
వెలిటూరి కేతెంచి వింతసంతసము
దళుకొత్త గురుదేవు దర్శించి [3]యతని
చరణాబ్జముల కిలఁ జాఁగిలి మ్రొక్కి
సరసాంతరంగుఁడై సంస్తుతి సేసి
వలగొని తన పోయివచ్చినవిధము
నలు[4]వలరార విన్నప మాచరించి
యలరి పండిత మల్లికార్జునారాధ్యుఁ
డిలఁ జరితార్థుండ నేనపో [5]యనుచుఁ
దలఁచెఁగదా పర్వతస్వామి [6]నన్నుఁ
జెలు[7]వొంద నీయట్టిశిష్యునికలిమి
నంచుఁ బ్రసాదకటాక్షనిరీక్ష -
ణాంచితామృతవార్ధి నతని నోలార్చి
శివలింగమయ మగు శ్రీగిరి[8]మెక్కి

౧. ల. ౨. లూ, ౩. దివ్య, ౪. వెల, ౫. యట్లు, ౬. పస్తు, ౭. వంద, ౮. కె.

డవిసీతి యగ్గిరియందు[1] వొందమియు
నవిసీతినెక్కిన నంఘ్రులు సోఁకు
నవయవంబులతోడ నందు వోరాదు
నవయవరహితమై యరుగంగరాదు
శివశివ యిదియెట్లు సిద్ధించెఁ దనువు
ప్రాణంబు మనసుఁ బర్వతనాథులోఁ బ్ర-
మాణింపరాని సమ్మదమునఁగూర్చి
యెనసియుండెడివిధం బెట్లకో యనుచు
మనమున నూహించి మఱి నిశ్చయిం[2]చి
తనువు సపర్యావిధంబున సమ[3]సె
మనసు సద్భావనామగ్నతఁ బొందెఁ
బ్రాణంబునకు నుండఁ బట్టొందు గలదె
ప్రాణేశ నీపదాబ్జంబుల కాక ?
యూర్జితప్రమథాత్మ యొండేమి మల్లి-
కార్జునపండితుఁ డనఁగ నిచ్చోట
నుండుటకంటె నెన్నండకో ప్రమథ-
మండలిలో భవన్మహాదాజ్ఞఁ జేసి
యుండంగఁ గాంతు[4]నకో యని కోరు
చుండురు నన్నట్టు లను[5]పఁగదయ్య!

౧. నొందేమి, ౨. ంప, ౩. సి, ౪. నొ, ౫. చ.

దేవ యీసంసారతీవ్రదుఃఖా[1]బ్ధి
లో[2]వెలి ప్రమథాదిలోకం[3]బెఱుంగ
నావాఁడు వీఁడుసుండీ వేఱుగాఁడు
నా[4]వి[5]న్ననువున గణంబులనడుమఁ
బిన్ననాఁటనుగోల బిలిబిలి[6]సురల
నెన్నఁడుఁ గలనైన నెఱుఁగుదునయ్య
గణనాథ భవభీతిఁ గాదె నాఁ డీశ-
రణు[7]సొచ్చునాదు పుత్త్రకళత్ర[8]సహిత
మెలమి దాసీపత్ర మిచ్చినయట్టి
యిలువుట్టుదాసినౌ టెఱుఁగవే దేవ!
చాల నీభవమహోజాలంబుతోడి
జాలి నేఁ బడఁజాలఁ జాల శ్రీశైల -
వల్లభ! నీయాజ్ఞ నచ్చినపనులు
నెల్లఁబెట్టితి భక్తి చేవ దలిర్ప
వాసనతో బసవనయు నీగర్భ -
వాసంబుఁ జొచ్చె దేవా పర్వతేంద్ర !

---

౧. గ్ని, ౨. నెతలార్చి, 3. బెలర్ప, ౪. నె, ౫. నన్నున్నవే, ౬. నరల, ౭. సాచ్చితినిపుత్ర, ౮. మిత్ర, (దీనితరువాత, "సహితంబుగా నిల సమ్మతిపత్రి, వహి నిచ్చినట్లు సేవంచునలేక", అని ఒక ప్రతిలో అధికపాఠమున్నది.

యెవ్వరివాఁడనై యే నుండువాఁడ ?
నివ్వసుంధర భక్తి కెల్లను బట్టు
గొమ్మఁక నెవ్వఁడు గోర్కులు సలిపి
నెమ్మి జంగమకోటి సీ వని నమ్మి
నమ్మనివారల నమ్మింప విస్ఫు-
టమ్ముగా వివిధదృష్టప్రత్యయములుఁ
జూపి బిజ్జలు నేఁపుమాపి [1]ధూపడఁచి
[2]పాపితార్కికులఁ బోఁజోపు నవైది-
కము వీరభక్తిమార్గం బని జంగ-
మము లింగ మనిప్రసా[3]ద మిహా[4]సౌఖ్యాది-
మోక్షసాధక[5]మని ముల్లోకములకుఁ
బ్రత్యక్షుండ పతి యని యఖిలంబు నెఱుఁగ
విన మమృతంబు గావించి సేవించి
యసదృశుల్ శివభక్తు లని[6]వివరించి
పరసమయంబుల భంగించి కీర్తి
వరియించి లోకపావనము గావించి
భవదీయసమయంబుఁ [7]బాలించి ఘోర-

౧. సంశయము, ౨. కోపించిలయకాలరుద్ర స్వరూప, 3. దమహిమసౌఖ్య, ౪. సుఖాది, ౫. న, ౬. విరచించి; విచారించి. ౭. భావించి.

భవములు[౧]వాటించి పంచినపనులు
భర్గ నిన్ మెప్పించి పంచినప్రమథ-
వర్గంబుకవిలియ వ్రాయించి మించి
నీలోన లీనమై నిలిచి నీయాజ్ఞఁ
బాలించి బండరు బసవ[౩]లింగయ్య
నటు గాన నేను దవంఘ్రి పద్మములు
నిటలతటంబున నెక్కొనఁ దాల్చి
యుండంగఁగోరెద నోపర్వతేశ!
ఖండేందుమౌళి! నీ గర్భంబులోనఁ
జొర[౪]నీవె నన్ను నీ పురి యగుచున్న
సిరిగిరి నుండెద శివ శరణనుచు,
శివ శివ శివ శివ శివ శివ యనుచు
శివదేవ యంచు నిన్ జేరఁగోరెదను
జొర నీవె నన్ను నీ పురి యగుచున్న
సిరిగిరి నుండెద శివ శరణనుచుఁ,
[౫]దోలి తాఁకెడుపులివోలె నీభవము
[౬]దూలంగ[౭]మఱి పాఱఁ ద్రోలి వేగంబ
చొర నీవె నన్ను నీ పురి యగుచున్న

౧. పాటి(లి)ంచి, ౨. ంచె, ౩. లింగంబు, ౪. నిమ్ము, ౫. ఓలి, ౬. తో, ౭. తు(దు)షు.

సిరిగిరి నుండెద శివ శర ణనుచు,
నఱిముఱి భవలతఁ బెఱికి వేఁటాడి
వెఱవక నను గానఁ బఱతేరు మనుచుఁ
జొర నీవె నన్ను నీ పురి యగుచున్న
సిరిగిరి నుండెద శివ శర ణనుచు,
మెడ సుట్టుకొని నన్ను విడువనిజన్మ
జడ మను పెనుబాము[1]కడమలు వాపి
చొర నీవె నన్ను నీ పురి యగుచున్న
సిరిగిరి నుండెద శివ శర ణనుచుఁ,
గని విని తిని మూఱుకొని[2]ముట్టి[3]చవులఁ
గను[4]కని బాఱెడుమనసు నిన్ జేర్చి
చొర నీవె నన్ను నీ పురి యగుచున్న
సిరిగిరి నుండెద శివ శర ణనుచుఁ,
[5]గడచుచుఁ[6]గుడుచుచుఁ గట్టుచు నిట్టు
లొడలికై యిడుమలఁ బడఁబోయెఁ బ్రొద్దు
సొర నీవె నిన్నునీ పురి యగుచున్న
సిరిగిరి నుండెద శివ శర ణనుచు,
నెఱమంట వొడగని యుఱికెడుమిడుత

౧. కడిక (స) లు నేసి; గం(డికసేసి, ౨. ముట్ట, ౩. చెవుల, ౪. కలి, ౫. గడగుచు; గడుపుచు, ౬. గుడుపుచు.

తెలిఁగున విషయాగ్నిఁ బఱచుపా టుడిగి*
చొర నీవె నన్ను నీ పురి యగుచున్న
సిరిగిరి నుండెద శివ శర ణనుచుఁ,
జిరి[1]మురిపనులకుఁ బొరిఁబొరి నరుగ
వెరవు గా దిది మేలి తెరవు రమ్మనుచు
చొర నీవె నన్ను నీ పుర మగుచున్న
సిరిగిరి నుండెద శివ శర ణనుచు,
ననుచుఁ గన్నడగ[2]ళ నంకించుపదము
లనురాగమునఁ బాడ నభవుఁడాలించి
పండితుద్బృజ్మనఃపరిపూర్ణుఁ[3]డై య -
ఖండితపర్వతాకారలింగంబు
నిర్భరకారుణ్యనికటకటాక్ష -
గర్భా[4]ర్భకుని నాత్మగర్భస్థుఁ జేసి
యంతలోనన పండితారాధ్యునాత్మ -
సంతతి[5]యును గులసతిసమేతముగ
లింగోదరమునంద లీన మై[6]రట్లు
సంగతం బగుశివాజ్ఞాపత్ర[7]సరణి
శివగణప్రార్థనఁ జిక్కినసకల

---

* చి, సి. ౧: మర ; మొరి, ౨. డుమెచ్చి, ౩. డగుచ, ౪. ష్ట, ౫. మును, ౬. నట్లు; రట్లు, ౭. సరసి.

భువనపావనునియపూర్వతనూజు
దరితసంసారుఁ గేదారయ్యఁ బుణ్య-
భరితు లోకారా[౧]ధ్యపట్టంబుఁ గట్టి
ప్రస్తుత[౨]శంభుఁడౌ పండితారాధ్య-
[3]హస్తాగ్రజుండు దోనయ్యయు భక్త-
[౪]వర్గంబు గొనియాడ వసుధఁ దద్గురుఁ డ-
[౫]నర్గళభక్తిరాజ్యము సేయుచుండె;
నంతఁ గేదారయ్య యాత్మసంతాన
సంతతియును శైవసంతానసంత-
తియు భువనారాధ్యతేజోవిభాతిఁ
గ్రియఁగొ[౬]ని యతులభాగీరథీ[౭]తీర్థ-
భావన లోకముల్ వరమపావనము
గావింప మఱి యట్లు గాక తదియ్య-
కేదారదేశి[౮]కు గీతచరి[౯]త్రు
గాదిలిసుతచతుష్కముఁ జెప్పనొప్పు
మనుమపండితుఁడు[౧౦]భీమనపండితయ్య-
యును మహాదేవయ్యయునుఁ జెన్నవిభుఁడు

---

౧. ధ్య, ౨. లోకుఁడౌ, 3. హస్తయ్యయును శివసమూహము గొనియాడ, ౪. వసుధతద్గురుమనోవాంఛితమునను, ౫. రసికతనర్గళభక్తిరాజ్య, ౬. నన, ౭. వాహ, ౮. క, ౯. త్ర, ౧౦. బీ.

సనఁగ గురుచతుష్క మాత్మసంతాన
తనయపరంపరోత్తరపరంపరలుఁ
బరిచితగురుపరంపర దేజరి[1]ల్లు
ధర వృషభేం[2]ద్రుపాదచతుష్క[3]సరణి
ధ్రువపురుషార్థచతుష్కవిస్ఫురణ
సవిశేషభవ్యమోక్షచతుష్కహే[4]ల
* వాలారు శ్రీనగద్వారచతుష్క-
లీల వార్ధిచతుష్కవేలాధరిత్రి
సముదితమహిమఁద చైత్యవసంతాన-
విమలాంబునిధిమధ్య విభ్రమానర్ఘ్య-
నాయకరత్నంబు నాలోకగురుస
మాయత[5]ప్రీతి నొప్పా రివటూరి
సోమనాథయ్య విశ్రుతవీరభక్తి
భూమాభిరామవిస్ఫురణ వెలుంగ
వారిపుత్త్రులు భక్తివర్ధన[6]పరులు
సూరీశ్వరుండు లోకారాధ్యపద వి-
హారుండు విశ్వనాథప్పయ్యఁగారు



---

౧. ల్లి, ౨. ంద్ర, 3. భరణ, ౪. శి, ౫. ప్రథిత, ౬. కరులు.
* 'వివిధవేదాంత వివేకత దనరి' అని ఒకపాదములో ఉన్నది.

గారుణ్యనిధులు[౧] సింగణమంచిగారు
ననఁగ గురుత్రితయాన్వయతనయ
తనయపరంపరోత్తరపరంపరలుఁ
బ్రభూతరగురుపరంపర దేజరిల్లఁ
ద్రిభువనంబులఁ బర్వఁ ద్రిపథగభాతి
వేదత్రయవిభాతి విశ్రుతాగ్నిత్ర-
యోదితకలితమహోన్నతఖ్యాతిఁ
దా నిట్లు గృతిసమాప్తంబయ్యె నంత
మానుగాఁ మదిపంచమప్రకరణము
నరయ నీకృతిసార మగుచతుర్థప్ర-
కరణమధ్యమున సంకలితమై వెలుఁగు
నవ్యగణసహస్రనామస్తవంబు
భవ్యముగఁ బఠించుఫలలేశమునను
నైహికాముష్మికాద్యఖిలసంపత్స-
మాహితాభీష్టసౌఖ్యము లొందు ననిసఁ
బ్రమథరుద్రాది పురాతననూత-
న మహాగణాభివర్ణనము లోకముల
నారూఢమతి మల్లికార్జునపండి-
తారాధ్యచరిత మాద్యంతంబు వినిసఁ

---

౧. లింగన, ౨. ల్లు; ల్లి.

## పర్వత ప్రకరణము

### ఫలశ్రుతి

జదివిన వ్రాసిన సంగ్రహించిన స-
ముదితాభిమతఫలంబులు వొందు దరుదె ?
కావున నీకృతి గారవించినను
వాపిరిఁ ¹జదివిన వ్రాసిన వినిన
నరుదొంద వారల కభిమతార్థములు
గరుణించు శివుఁడు మంగళమహాశ్రీలు *

---

౧. విన్నమామావారికి శివుఁడు, ౨. రికిన.

* ఇచ్చట ఈక్రిందిపద్యము లున్నవి. ఇవి మూలములోనివై ఉండవు.

ఉ. శ్రీభసితత్రిపుండ్రకపరీతవిశంకట ఫాలు జాటజూ
టీభరధారు నిర్మలపటీపటలావృతదేహు నక్షమా
లాభరణాభిరాము బసవాక్షర పాఠపవిత్రవక్త్రుఁ జి
చ్ఛోభితచిత్తుఁ బాల్కురికి సోమయదేశికుఁ బ్రస్తుతించెదన్.

శా. శ్రీమన్మైత్రవరమావరున్ నియమితున్ శ్రీచెన్నమల్లేశ్వరున్
ధీమంతున్ నిగమాగమస్మృతిమతోద్గీతార్థనేత్రున్ బుధ
స్తోమంబున్ బ్రభునార్ధ్యనేత్రయును నాద్యుంబండితారాధ్యులన్
గామింతు న్నతియింతుఁ గొల్తుఁ దలఁతున్ గామ్యార్థసంసిద్ధికిన్.

పండితారాధ్యచరిత్ర

ఇది యసంఖ్యాతమాహేశ్వరదివ్య పద పద్మసౌరభ
భ్రమరాయమాన జంగమలింగ ప్రసాదోపభోగ
సంగత సుఖసుధాశరధినిమగ్న సుకృతాత్మ
[1]పాలకురికి సోమనాథసుకవిప్రణీతభాసుర
తర దండనాయక బసవాంకనఖ్యాతగుణ
గణాయతకీర్తిదిగంతత్రిలోకగురు
పండితారాధ్యచరితంబునందు
వరువడిఁబంచమప్రకరణ
మొప్పు.

శ్రీ

---

౧. నూణ, ౨. పాలు.